# మణిమంజరి

వాఙ్మయ యోగ
పరిశోధన
విశేష సంచి



7

టూరి ప్రభాకర శాస్త్రి
మెమోరియల్ ట్రస్టు
దరాబాదు.



ప్రముఖులతో విస్సావారు

కూర్చున్నవారు (ఎడమనుండి) : 2. విస్సా అప్పారావు, 3. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు
4. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి, 5. న్యాపతి సుబ్బారావు పంతులు.

రెండవ వరుస (ఎడమనుండి కుడికి): 3. కాటూరి వేం[illegible]టేశ్వరరావు

[ ఈ ఛాయాచిత్రములో కొందరిని మాత్రమే [illegible]గలతిమి ]

# మ ణి మ ం జ రి

## వాఙ్మయ యోగ పరిశోధన

విశేష సంచిక

సంపుటం 7 | ఫిబ్రవరి, 1984

సంపాదకులు

**డా॥ వేటూరి ఆనందమూర్తి**





హైదరాబాదు

వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు
2-2-18/15/D/1, బాగ్ అంబర్‌పేట,
దేశముఖ్ కాలనీ, హైదరాబాదు.

''మణిమంజరి''
శ్రీ ప్రభాకర జయంతి
విశేష సంచిక
ఫిబ్రవరి, 1984

విడిప్రతి : పదిహేను రూపాయలు

సభ్యులందరికి ఉచితము

ప్రకాశకులు :
వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు
2-2-18/15/D/1, బాగ్ అంబర్‌పేట
దేశ్‌ముఖ్ కాలనీ, హైదరాబాద్ - 500013.

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాదు.

# విషయ సూచిక

—(౦)—

శ్రీరస్తు

# కామధేనువు కథ

V. PRABHAKARA SASTRY

Published by
K. VENKATA SESHAYYA
Triplicane
**1914**

*The Vaijayanti Press, Madras.*

Price Annas 2

ఇది 1914లో ప్రకటింపబడిన కామధేనువు కథ ప్రథమ ముద్రణ ముఖపత్రము. వ్యావహారిక భాషలో నాడు శ్రీ శాస్త్రిగారు వ్రాసిన ఈ గ్రంథం ప్రజల ఆమోదాన్ని పొందినా పండితలోకంలో ఒక సంచలనాన్నే కలిగించింది. గిడుగువారి వ్యావహారిక వాదానికి చేయూతగా వేటూరివారు తెలుగుజాతి కిచ్చిన కానుక ఈ కామ ధేనువు కథ.

# తొ డి మ

ఈ కథ వాడుక భాషలో వ్రాసేటందుకు నాకు ప్రోత్సాహం కలిగించిన వారు ప్రతిభానిధులు రెంటాల-వేంకట సుబ్బారావు పంతులుగారు. బహుశ్రుతులు ప్రొఫెసరు రంగాచార్యులవారు సెలెక్ట్ మీటింగ్‌లో యిచ్చిన ఉపన్యాసము కూడ తోడ్పడినది. ఇప్పటి వ్యాకరణం ప్రకారము భాష నేర్చుకోలేని సామాన్య జనులకు చదువు తెరవు చూపించటము కోసం, చెదరులుగా లోకంలో నెలకొని వున్న యీ కథను సంస్కృతము చూచి పెంచి పెద్దచేసి వ్రాసి ప్రచురించినాను. శ్రీ సుబ్బారావు పంతులు గారు తమ ఉద్దేశ్యమును కడపట 'హెచ్చరిక' అని సమకూర్చినారు. అనేకుల కీకథ వినిపించినాను. సంతోషించినారు. అద్భుత ప్రతిభ గల వేపా-రామేశం పంతులు గారు సకుటుంబముగా విని తమ సంతోషము వెయ్యినోళ్ళ వెల్లడించినారు. ఇట్టి వారి సంతోషమే నాకు పదివేలు.

— వేటూరి ప్రభాకరశాస్త్రి

My friend, Mr. V. Prabhakara Sastri was kind enough to read to me the Story of "కామధేనువు కథ" adapted from the Padma Purana (see also manuscripts No. 44 in the Triennial Catalouge of manuscripts by Prof. Rangachari) written by him in a new prose style and I take this opportunity of expressing the great delight felt by me and the members of my family in listening to it.

The important feature about it is the introduction of a few forms of inflexions of verbs and nouns not sanctioned by the rules of Telugu Grammar ; but, it must be observed, that they have received the sanction of usage as I find them used in inscriptions, in historical narratives found in manuscripts in the Oriental Library and in proverbs. Unless we are prepared to reject these as valueless in a controversy of this sort, it follows that they are legitimate and permissible modes of expression. They are part of the language. No doubt the orthodox School of Telugu writers who still hold to the view that no changes ought to be made in the rules regulating Telugu composition will not accept these forms. But, if we reject them the loss to the Telugu language and literature is immense. The changes involved are mostly in the direction of simplification and are eminently fitted for use in books for children, females and the general reader. Some of them appeal to the ear by their grace. It may be here pointed out that Mr. Sastri is not an advocate of the free adoption of all the colloquial forms of

expression in use in the various dialects prevailing in the country. He does nothing of the sort in the book. The changes can not, indeed, be characterised as vulgar except to the strict grammarian who is unable to shake off the shackles of the ancient rules. If our efforts to extend the basis of primary education and to diffuse knowledge and culture even among the lowest classes are to be crowned with success, some such departure from the traditional restrictions is absolutely essential. One may observe that a language which has a crystalised structure and cannot change can never be progressive and cannot be expected to unfold all the possibilities natural to its genius and latent in it. It is to be hoped that the new style will be accepted and be brought into general use.

VEPA RAMESAM.

---

శ్రీరస్తు.

# కామధేనువు కథ

గంగానదికి ఉత్తరభాగాన గోకర్ణం అనే పుణ్యక్షేత్రం కద్దు. దాని చేరువను పూర్వం వొక అగ్రహారం ఉండేది. ఆ అగ్రహారంలో వొక బ్రాహ్మణుడు, చాలా ఆవులను ఆర్జించుకుని, వాటికి కామాక్షి మీనాక్షి విశాలాక్షి అన్నపూర్ణ కపిల కామధేనువు మొదలయిన పేర్లు పెట్టుకుని సాకుకుంటూ తానూ తన సోమిదమ్మా నిత్యం ధూపదీపనైవేద్యాలిచ్చి పూజచేస్తూ సుఖాన ఉండేవారు. ఆ గోవులను సంరక్షణ చేసేటందుకు వారు గోపాలుడనే వొక గొల్లవాణ్ణి ఏర్పరిచినారు. వాడీపశువులను దినదినమూ మూడు వేళలా నీళ్ళూ మేతా కలిగిన స్థలాలకు తోలుకుపోయి మేపి నీళ్ళు తాగించి రెండు గడియలు నీడను పడుకోనిచ్చి, నొప్పీదప్పీ కలుగకుండా పోషిస్తూ వుండేవాడు. ఈ విధంగా గట్టులను, వంకలను, కసువుగల జాగాలను, మేపుకుంటూ, మహాభక్తితో వాడు కాపాడుతూ వుండగా, వొక కాలాన వచ్చిన వేసంగికి చెరువులు, గుంటలు, వాగులు వట్టిపోయెను. నీళ్ళు మేతలకు తక్కువ కావడంచేత అప్పుడాగోపాలుడు గోవులను దూరంగా కొండలోయలలోకి తోలుకుపోయి మేపుతూ వుండగా వొక దినమందు కారుమబ్బులు కమ్ముకుని మహాప్రళయముగా గాలి, ఉరుములు, పిడుగులు, మెరుపులు మెండుకొని అఘోరమైన వర్షం పట్టెను. ఆ కొండలోయలో యెడ విడువకుండా వాన కురిసేటందుచేత గోవులన్నీ చెల్లాచెదరై బెదరి నలుముఖాలకూ పోయెను. అందులో కామధేనువనే గోవు వొంటిగా చెదరి అక్కడొక కోనలో వొక గుట్టకింద వొదిగి యీదురుగాలికి వణకుతూ వుండగా ఆ సామీప్యాననే గుహలో నెలదినముల నుంచి ఆహారం లేక శుష్కించివున్న పులి వొకటి, గుహ బయటికి వచ్చి, ఆ వణకుతూ వున్న కామధేనువును తేరిపార చూచెను. చూచి మహాసంతోషంతో ఒక చెట్టు మరుగున నక్కి, చెవులు కొక్కరించి, తోక నిట్టపొడుచుకుని, కొండంతది కుర్కంతదిగా వొదిగి వచ్చి, ఆ కామధేనువును గోళ్లతో గొట్టి మెడ కరచుకుని ప్రాణంతో తన గుహలోకి తీసుకుపోయి అంతట వధించి భక్షించవలెనని ప్రయత్నపడేటప్పటికి కన్నుల నీరు

కారగా మహా దుఃఖముతో ఆ కామధేనువు అడలసాగెను. అది చూచి వ్యాఘ్ర రాజు ముఖం అంతా కళ్ళుచేసుకుని యీ విధంగా పలికెను. కామధేనువా! నీ వేల దుఃఖపడేవు? నేను నెల దినముల నుంచి వుపవాసంతో భక్షణ దొరకక శుష్కించి వున్నాను. ఈ పొద్దు నేను లేచినవేళ చాలా మంచిది. కిందటి జన్మాన యెవరికో మృష్టాన్నం పెట్టినాను. ఆ ఫలం నేడు అనుభవానకు వచ్చినది. నిన్ను నేను విడిపెట్టవలసినది లేదు. నీకు మృత్యువను నేను గనుక నాకు దొరికితివి. నీ చావు యేడిచినా తప్పదు. నవ్వినా తప్పదు. నోటికి చిక్కిన ఆహారం వదులుకుంటానా ? ఎందుకు దుఃఖిస్తావు ? వ్యర్థము. ఇట్లా అన్నంతట కామధేనువు పల్కిన వివరం. విను వ్యాఘ్రరాజా ! శరీరాలు భూమిమీద శాశ్వతాలు కావు. పుట్టడం యెప్పుడయితే కలిగిందో చావడం అప్పుడే కలిగింది. తప్పని సరి అయిన చావుకు దుఃఖిస్తే ఫలం కద్దా! యీ చావు అన్ని ప్రాణులకూ కలుగుతుందా, నాకు వొక్కదానికే నేడు కలిగిందా ? భూమిమీద బ్రతకడం నీళ్ళమీద బుగ్గచందం. అందులో నాల్గుపాదాల జంతువులకు వ్యాధులు అనేకం. ఆలాటి వ్యాధులచేత చావడం కంటె నీచేత మృతిపొందడం భాగ్యం కాదా! నేను చేసుకున్న పుణ్యంచేతనే నీకు దొరికితిని. ఇదిగాక, నీకు చిక్కినతర్వాత ప్రాణికి మరి బ్రతు కెక్కడుంటుంది ? నేను చావడానికి వెరచి దుఃఖించే దానిని కాను. నా వ్యసనం వేరు. మనవి చేస్తున్నాను చిత్తగించు; ఓ మృగరాజా ! నేను చాలాకాలం బిడ్డా పాపా లేక నోయరాని నోములు నోచి, పట్టరాని వ్రతాలు పట్టి రాతిరాతికీ మొక్కి గుంటగుంటలో మునిగి సకలదేవతలనూ ప్రార్థన చేయగా యీశ్వరకృపాకటాక్షంచేత గొడ్డుపోయిన నా కడుపున వొక బిడ్డడు పుట్టాడు. లేక లేక పుట్టిన కూన. పాలుకుడుచుకోవడమేగాని యింత కసవుమేయడం నేరడు. నేను పొలం పోయి సాయంకాలాన తిరిగివచ్చేవరకూ నా దారే యెదురు చూస్తూ అడలుతూవుంటాడు. వాడికి సహవాసం రెండోవారు లేరు. వివేకము తెలిసిన శిశువు కాడు. నే నీపొద్దు పొద్దున లేచివచ్చేటప్పుడు బ్రాహ్మణమ్మవారు పాలుపిండే సమయాన నా బిడ్డకొక చేపు దాచుకోక జల్లున చేపినాను. కపటము చేయలేక పోయినాను. చిన్నవాడు ఆకలితో యెంత వరుడుతున్నాడో తెలియదు. నేను ఇక్కడ చిక్కితిని. వాని బ్రతుకు యేమవుతుందో ! కడుపుమోహంచేత మరుగుతూవున్నాను. ఒక్కసారి నా బిడ్డ దగ్గరకు పోయి కడుపారా కడసారి పాలు కుడిపి, నా ముద్దు తీరేటట్టు ముఖం నాకి, యిరుగుతో పొరుగుతో చెప్పి

వొప్పగించి మంచిచెడ్డలు కొంచెం తెలియజేసి యింతలో తిరిగి వస్తాను. ఇప్పుడు నాకు చేపు వచ్చింది. కనుక నామీద చాలా దయవుంచి సెలవిస్తే నాలుగు గడియలలో శీఘ్రంగా వస్తున్నాను. ఈ పుణ్యానకు వొప్పితివా యిప్పుడు భక్షించేవాడవు యిక కాస్త సేపటికి భక్షిస్తున్నావు. నీవు ధర్మాత్ముడవై నాకు అనుజ్ఞ యివ్వవలెను. కడుపు తీపు పీడిస్తూ వున్నది. సత్యం తప్పక వస్తాను. ప్రమాణం. నా మీద దయవుంచి పంపవయ్యా! అని కోరినంతట వ్యాఘ్రం అన్న వాక్యం. ఏమి టిది! మరణం యెరుగవా? నన్ను చూస్తే జంతువు లన్నీ ప్రాణాలువదలేవి; నీవు చింతాకంతైనా భయంలేక జాలిపడుతూ బిడ్డబిడ్డఅని అడలుతూ వున్నావు; చచ్చేదానిని బ్రతికించడం బిడ్డచేతగాదు, అమ్మచేతగాదు, అబ్బచేతగాదు. నీవు నీబిడ్డదగ్గరకువెళ్ళి యిరుగుపొరుగును చూచి ఇంకా తిరిగిరావడం యెక్కడిది? ధరణిలో పశు జీవాలకు యేటి నియమం? యేటి సత్యం? ఇది కలియుగం. న్యాయానకు కాలం కాదు. ప్రాణం నిమిత్తం నూరబద్ధాలైనా ఆడి విడిపించుకుపోవలె ననే యత్నాలే కాని సత్యానికి కట్టుపడి తిరిగివచ్చేవారెవరుంటారు? చావంటే భయపడుతారుగాని నీవు నన్ను చంపవయ్యా అని వస్తారా? ఎక్కడ నిజం! ఎక్కడ కథ! ఇట్లా యెందుకు మాయలు చేస్తావు? అని మందలించెను. అందుకు కామధేనువు సత్యప్రమాణకంగా చెప్పేమాటలు. పులిరాజా! నామీద ఆగ్రహించక కరుణించు. ఈడువారికి తోడువారికి నా పసి బిడ్డను వొప్పజెప్పి వస్తాను. రాకపోతే వొట్టు; నమ్మి విడిచిపెట్టు. నేను మాట తప్పేదానిని కాను. ప్రపంచంలో అందరూ అసత్యవాదులే అయితే యెట్లా జరుగుతుంది? ఎవ్వరికీ బ్రతుకు శాశ్వతం కాదు. తాము పోయేది తాము కానరు. నేను సత్య ప్రమాణకంచేసి చెప్పుతాను, నీ వవశ్యం నమ్మవయ్యా! ప్రపంచంలో వున్న సత్యవంతులు, ధర్మాత్ములు, జ్ఞానవంతులు, సకల మునీశ్వరులు, రాజాధిరాజులు,మహాపతివ్రతలు, సూర్యచంద్రాదులు వినేటట్టుగా ఆన పెట్టుకుంటున్నాను. పృథివిలో నియమం లేనివాడు, దబ్బరలాడినవాఁడు, వ్యవహారధర్మాలు అన్యాయంగా తీర్పుచేసినవాడు, మనసున కపటం పెట్టుకొని మధురవాక్యాలు పలికినవాడు, గ్రామానకు చేటు తెచ్చినవాడు, బీదసాదులను కొట్టినవాడు, చెవిటివాణ్ణి, కళ్ళులేనివాణ్ణి అనాదరణ చేసినవాడు, లేనిభాగం కద్దన్నవాడు, కాసేపూసే చెట్టు కొట్టినవాడు, చెరువుముఖస్థలాలు దున్నినవాడు, నడితిలేని నడవళ్ళు నడిపించినవాడు, తల్లిదండ్రులను చెడనాడినవాడు, తన మరుగుచొచ్చిన వారిని

పట్టిచ్చినవాడు, బంధుజనమును దూషించినవాడు, కులపాతకం చేసినవాడు, అల్పజాతితో సావాసం చేసినవాడు, సజ్జనుడిమీద నిందలుచెప్పినవాడు, దుర్జనుణ్ణి భూషించినవాడు, చదువుచెప్పిన అయ్యవారిని ఆక్షేపించినవాడు, తన దొరను రణభూమిని విడిచిపెట్టి తనప్రాణంకొరకు పారిపోయినవాడు, తాగే గంజి వలక బోసినవాడు, విద్వాంసులను దూషించినవాడు, నీళ్ళను నిందచేసినవాడు, తోవలుకొట్టి దోచుకున్నవాడు, అన్యులసొమ్ముకు ఆశపడ్డవాడు, దూడలకు నాలుగోపాలు పాలువిడువక అన్నీ పిండుకున్నవాడు. నోరెరుగని పక్షి మృగాదులను చంపినవాడు, అప్పతీసుకొని అన్యాయంగా అప్పుడే యిచ్చి వేసినానని తగవు పెట్టినవాడు, ప్రభుత్వం చేస్తూ, ధర్మంవిడిచి దండు గులు తీసుకున్నవాడు, పీటలమీది పెళ్ళిళ్ళు చెడగొట్టినవాడు, ఒకళ్ల మేలు వోర్వలేక వుసూరుమన్నవాడు, చూస్తూచూస్తూనే కళ్ళలో దుమ్ముకొట్టి ద్రోహం చేసినవాడు, భిక్షం పెట్టక తాను కుక్షినించుకున్నవాడు, విడిచి కట్టక దున్నిన వాడు, ఎరుగనిదే నేరం మోపినవాడు, దేవబ్రాహ్మణ మాన్యాలకు చిక్కు తెచ్చినవాడు, ఒకరిని వంచించి అపహాస్యం చేసినవాడు, దార్లకు కంపకొట్టి మార్గస్థులతో జగడం వేసినవాడు, పూర్వం నడిచిన ధర్మం తామసంచేత తానై చెడగొట్టినవాడు, ఎరువుకు సొమ్ము తీసుకుపోయి దొంగలు దోచుకున్నారని ముంచినవాడు, పంక్తిభేదం చేసినవాడు, ధారాదత్త మనోదత్తాలు యెగవేసిన వాడు, ధర్మమని మాటయిచ్చి ఆసాసపెట్టి అడిగితే లేదని కసురుకున్నవాడు, తన పెండ్లామును అన్యులమాటలు విని వెలివేసినవాడు, గురుబోధ మరచిపోయిన వాడు, దూడలేని యావును పాలు పిండినవాడు, దాయగట్టక పితికినవాడు, పాలు వుడిగిన తర్వాత పర్రకు తోలినవాడు,— ఈలాటి అధర్మాలు చేసినవారు యే గతికి పోతారో రాకపోతే నేనూ అదేగతికి పోతాను. నేను వచ్చేది సిద్ధం. అని యీ విధంగా సత్య ప్రమాణకం చేయగా విని వ్యాఘ్రరాజు పలికే పలుకులు. నీ వైతే నమ్మకంగా ప్రమాణాలు చేస్తున్నావు. లోకంలో చాలామంది తమ పని తీరిన తర్వాత చేసిన మేలు మరచిపోతారు. గట్టెక్కిన తర్వాత పుట్టివాడితో పోట్లాడేమచ్చే హెచ్చు. పాలుడిగినతర్వాత పిల్ల తల్లినే విడుస్తుంది. చేసిన మేలు మరవక, ఆడిన మాట తప్పక నడుచుకునే వాళ్లు ఎక్కడో అరుదు. వేయింటి కొక్కడు వుంటాడో వుండడో! చెప్పడం తేలికగాని చెయ్యడం కష్టం. నీవిప్పుడు వత్తామనే అనుకున్నా అక్కడికి వెళ్ళిన తర్వాత మందలో పశువులూ, నీ బిడ్డా

అడ్డపడి, "ఆ పులి తెలివి తక్కువది. దానిని యెట్లాగో నమ్మించి దూసుకుని రానేవస్తివి. ఇంకా పోయేదేమిటి? చావు తప్పించుకునేటప్పుడు వొట్టూలేదు సత్యంలేదు'' అని నిన్ను మందలిస్తే వాటిని దులపరించుకుని యెట్లా రాగలుగుతావు? అక్కడ వుండవలెనని బుద్ధిపుట్టదా అనగా, నూరు అరైనా, అరు నూరైనా నిజానికి వచ్చి వాలుతున్నాను; తప్పను; తప్పను; తప్పను; అని ముమ్మాటు చెప్పేటప్పటికి వ్యాఘ్రరాజు ''నీ సత్యాలు నన్ను వొప్పిస్తున్నవి. నీవు ఆడి తప్పని దానవవి నమ్మకం కలిగింది. పోయిరా; మాట నిలుపుకో" అని సెలవిచ్చెను. అంతట కామధేనువు వ్యాఘ్రరాజుకు నమస్కారం చేసి అంబా అంబా అని అడలుకుంటూ పొదుగు చేపు లెత్తి సలపరిస్తూ వుండగా అదరా బీదరా తన బిడ్డ దగ్గిరకు పరుగెత్తుకొని వచ్చెను. వచ్చి బిడ్డ మోర మూచూస్తూ నాకుతూ దుఃఖపడుతూ ''నాయనా, ఆకలిగొంటివి పాలు కుడుచుకో'' మని పాలు తాగించి ''బిడ్డా, ఇక నీకు అమ్మను చూచే ప్రాప్తి లేదు. ఇదే చివరచూపు; రేపు యెవరు పాలిస్తారో! ఎట్లా బ్రతుకుతావో నాయనా!'' అని విచారపడుతూ వుండగా కొమారుడు "అమ్మా,నీవు చిన్నబోయినదెందుకు? నీ శరీరాన రక్తధారలు,గంట్లు వున్న కారణం ఏమిటి?ఇట్లా వ్యసనపడుతున్నావేమి?"అనిఅడిగెను.అందుకు కామధేనువు చెప్పిన వివరం. నాయనా!నే నీవేళ వర్షబాధకు తాళలేక మందలో తప్పి వొంటిగా కొండ లోయలోకి పోయి బెబ్బులికి పట్టుపడ్డాను. పోరాని చోట్లకుపోతే రారాని కష్టాలు రాకమానవు. అట్లా పులిరాజు నన్ను చంపి భక్షించేటందుకు యత్నం చేసేటప్పటికి నిన్ను కన్న మోహంచేత మొగ్గలేక నేను యిట్లా వేడుకున్నాను. వ్యాఘ్రరాజా! నేనీపొద్దు దొడ్డిలో నుంచి వచ్చేటప్పుడు, నా కుమారుడికి స్తన్యపానం యిచ్చిరాలేదు. కనుక నేను యింటికిపోయి నా బిడ్డకి పాలిచ్చి ఆకలి తీర్చి బుద్ధిచెప్పి యిరుగు పొరుగువారికి వొప్పగించి, నాలుగు గడియలలో సత్యం దప్పక తిరిగి వస్తాను. నన్నింటికి పంపవయ్యా అని యెంతో వేడుకున్నంతట్లో వాఘ్రరాజుకు దయవచ్చి త్వరగా పోయిరమ్మని సెలవిస్తే వస్తిని. నేను సత్యం దప్పక పోవలెను. బుద్ధి గలిగివుండుమా అనెను. అంతట గొల్లుగొల్లున తానేడవ తల్లియేడవ కాగా కొంతకు కొమారుడు పలికినవివరం. అమ్మా! నీవు ఎక్కడకు పోతావో నేనూ అక్కడకే వస్తాను. నీతోడిదే నాకు లోకం. ఆ పులి నీతోపాటు నన్ను కూడా మింగితే మాతృభక్తులకు యే గతి కలుగుతుందో నాకూ అదే గతి కల్గుతుంది. లేదా నీవు వెళ్ళవద్దు వుండు. నీవు పెట్టుకున్న వొట్లూ సత్యాలూ నాకు తగుల్తవి. తల్లి లేకపోయిన తర్వాత తనందేనికి ? నీవు లేకపోతే నాకు దిక్కె

వ్వరు? నా బ్రతుకు ఎందునా పొందని దవుతుంది. పాలు తాగే బిడ్డలకు తల్లి వంటి దైవం కద్దా! తల్లివంటి బంధువులున్నారా? అని యీ విధంగా కళ్ళనీళ్ళు కార్చుకుంటూ కాళ్లావేళ్లాబడి మొరపెట్టేటప్పటికి ఆ కామధేనువు కొమారుణ్ణి బుజ్జగిస్తూ యీ విధంగా పలికెను. "నాయనా! తక్కువ నోములు నోచి యెక్కువ ఫలాలు రమ్మంటే యెట్లా వస్తవి? దైవం మనకింతే వ్రాసినాడు. పులిరాజుకు ఆహారం కావలసింది నేనేగాని నీకు పనిలేదు. నీవు అన్యాయంగా శరీరం యెందుకు వదలుకుంటావు? తనం వుంటేనే ధర్మాలన్నీనీ, కాబట్టి నీవు రావద్దు. నాయనా! ప్రాణంపోయినా అబద్ధం ఆడరాదు. అందరికీ చావు వున్నదే. నిజం నిలుపుకోవలెను. తన నిజమే తనకు సహాయం అయ్యేది. నేపోవలెను నాయనా, నేపోవలెను. నిన్నిట్లా అన్యాయం చేసి పోవలసిన గతి నాకు వ్రాసివుండగా తప్పించడం యెవడితరం? నీతో సావాసాన మేసేదూడలను పొడవక పోట్లాడక కలిసిమెలసి అన్యోన్యంగా వుండు. నిన్ను సాకేవారికి నీ శరీరం అవిసేటట్టుగా దున్నుతూ, పారిపోక, చిక్కులు పెట్టక, దొంగచేలు మేయక, పలుపులు తెంచక, యీ కోడె మంచి కోడె అనిపించుకుని, నలుగురికీ మంచితనంగా నడుచుకో. అడవులలో మడుగులలో వుండేటప్పుడు వొళ్ళు మరచి వుండబోకు. ఆసగొండితనాన వొడు దుడుకు నేలల గడ్డిపరకలకు పోబోకు. ఆశకు పోతే యీ లోకంలోనూ ఆ లోకంలోనూ చెరుపే వస్తుంది. గోళ్ళున్న జంతువులనూ, కొమ్ములున్న జంతువులనూ, విల్లంబు లున్నవారినీ, ఆడవాళ్ళనూ, ఏళ్లనూ, ఎప్పుడూ నమ్మివుండరాదు. పసిదూడందీ యేదికూడా కొరకరాదు. ఒంటిగా అడవులలో తిరుగవద్దు. ఎవరికీ బాధ కలిగించవద్దు. పరువు మర్యాదలతో బ్రతికిన బతుకే బ్రతుకు. జగత్తు నిజంకాదు. అంతామాయ. నాయనా! నీవు అడలవద్దు. నేను పులిపాలికి పోతాను" అని కుమారుణ్ణి మందలించి, లోలోపల "కడుతీపువంటి తీపులేదే, అయ్యో! అయ్యో!" అని కళ్ళనీళ్ళు గ్రుక్కుకుంటూ, సత్యధర్మం తప్పజాలక ప్రయాణమై, తన యీడువారితో జోడువారితో తన సంగతి అంతా తెలియజెప్పి తన కుమారుణ్ణి వొప్పగించి యీవిధంగా పలికెను. అమ్మలారా! దిక్కులేని నా బిడ్డణ్ణి కాపాడండి. మీకు వొప్పగిస్తున్నాను. చిన్నవాడు చిన్నవాడు. మంచీచెడ్డా యెరుగడు. తగిన బుద్ధి చెప్పండి. ఏయమ్మయినా యిన్ని పాలిచ్చి పుణ్యం కట్టుకోండి. తల్లిలేని బిడ్డని తలావొకపోటూ పొడవక వెనకకువస్తే కాళ్ళు విసరక ముందుకు వస్తే ముట్టెవిసరక, తలతో సాదుచేసుకుని సాకుకోండి. వీడు నా బిడ్డకాడు; మీ

బిడ్డ; మిమ్మందరినీ చూచి బిడ్డను మీకు వొప్పగింత పెట్టడానికి వస్తిని. త్వరగా పోవలెను. తెలిశో, తెలియకో మీకు నే నిదివరకు చేసిన అపరాధాలు క్షమించండి అమ్మలారా! అని ప్రార్థించి, కాళ్లమీదపడి కళ్లనీళ్ళు కార్చుకుంటూ, నేను వ్యాఘ్రానకు భక్షణ నిమిత్తం పోతూవున్నానని చెప్పెను. అప్పుడు కులము గోవులన్నీ ఆలోచనచేసి పలికిన పలుకులు. ''దాని సుఖం చూరపోను! నీ ప్రాణం విడుచుకుని దాని కడుపు నింపుతావా? నీ దారి నీదే, దానిదారి దానిదే. నీ వేదో ఉపమచేత తప్పించుకుని ఎట్లాగూ రానేవస్తివి. చిన్నవాణ్ణి తల్లిలేని వాణ్ణిచేసి నీవు మళ్ళీ పోవద్దు. ఏ వొట్లయినా ఏ సత్యాలయినా చావు మూడేటప్పుడు విడనాడితే దోషం వస్తుందా? అందుకని ప్రాణం పోగొట్టుకుంటారా! పసిబిడ్డను అన్యాయం చేయవద్దు. ప్రాణాలు నిలువుకునేపట్ల అబద్ధం ఆడినా తప్పులేదు. నీవుపోవద్దు. నిలు'' అని యెక్కడలేని జాలితోనూ పలికేటప్పటికి కామధేనువు అనే మాటలు. నేను తనకు చిక్కినపుడే పులి చంపివేస్తే యేమిచేయగలదాన్ని? ప్రాణాన కపేక్షించి అసత్యం ఆడితే శాశ్వతంగా బ్రతుకుతానా? చావు ఎన్నటికైనా వున్నదే. ఎప్పటికీ సత్యాన బతికిన బతుకే బతుకు. ఇంకొకళ్ళ ప్రాణాలకు సంకటము వచ్చినపుడు వాళ్ళను రక్షించడానికి అబద్ధం ఆడితే ఆడవచ్చునుగాని తన ప్రాణాలకని తాను అబద్ధం ఆడరాదు. అన్నమాట తప్పడానికి నాలుకా తాటిపట్టా! పులికి నమ్మికగా ప్రమాణం యిచ్చి మీ మాటల చొప్పున పోకనిలిస్తే నరకమే గాని మోక్షప్రాప్తిలేదు. మోక్షం లేకపోయిన తర్వాత నాకు యీ శరీరం యీ బ్రతుకు ఎందుకు? మీరు సంతోషంగా నాకు సెలవివ్వండి అని మనసుదిద్ది సమాధాన పరిచేటప్పటికి ఆ గోవులన్నీ నీవు మహాసత్యాత్మురాలవు; నీ సత్యమే నీకు తోడై కాపాడుతుంది. పో, మా తల్లీ పో, అని జాలిజాలిగా కన్నీళ్లు విడుస్తూ వొప్పుకున్నంతలో కామధేనువు మందకు చుట్టివచ్చి ప్రదక్షిణం చేసి, వృక్షాల్లారా! పక్షులారా! వనదేవతలారా! జలదేవతలారా! తల్లిలేని నా పిల్లణ్ణి కాపాడండి, దిక్కు మీరేనని దుఃఖంతో కడుపు తరుగుకునిపోయేటట్టు వేడుకుని, ఆడినమాట నిలుపుకునేటందుకు పులిరాజు వున్న కొండలోయలోకి పోయెను. పోయి వ్యాఘ్రరాజు యెదుట నిలబడి మొక్కి "పులి రాజా! నే నాలస్యం చేయడంచేత నీ వాకలిని చాలా గాసితివి. నాకు దోషము వచ్చెను. అక్కడ నా కొమారుడు కాళ్లా వేళ్లా చుట్టుకున్నాడు. బంధువు లందరికీ కుమారుణ్ణి వొప్పగించి వచ్చేటందుకు ఆలస్యం అయింది. నా తప్పు క్షమించి

నీ కుక్షి అనే మహామోక్షానికి నన్ను పంపవయ్యా" అని వేడుకునేటంతలో తోక యెగనెత్తుకొని ఆ కోడెదూడ పరుగు పరుగున వచ్చి తల్లి కాళ్లముందర, పులి రాజుకు యెదురుగా నిలబడేటప్పటికి, పొందబొయ్యే చావునూ, ముందు అడ్డం వచ్చే బిడ్డనూ, చూచుకుని కామధేనువు యీ విధంగా పలికెను. పులిరాజా! ముందు నా రక్తమాంసాలతో ఆకలి తీర్చుకుని, అంతట యీ బిడ్డడితో కడుపు నించుకొందువని వేడుకుంటాను. అన్నంతట వ్యాఘ్రరాజు పలికే వివరం-కామధేనువా ! నీవు మహా సత్యాత్మురాలవని మొదటే నమ్మినాను. ఇటువంటి సత్యం తప్పని మహాత్మురాలికి కీడు చేయరాదనుకుని, అయినా నిజం పరీక్షచేసి చూదామని తిరిగీ రమ్మన్నాను. కాకపోతే నాకు చిక్కిన జీవికి బ్రతికిపోవడం కూడా వుంటుందా? సత్యం తప్పక ప్రాణాలకాశించక వస్తివి. ఇందుకే సంతోషం కలిగింది. నిన్ను భక్షించడంకన్న అధికం తృప్తి చెందితిని. నిన్నూ చంపవలసినది లేదు; నీ బిడ్డనూ చంపవలసినది లేదు. ఇంత మహా సత్యాత్మురాలవైన నిన్ను చంపితే నరకమేగాని వేరేగతి లేదు. కాబట్టి నీవూ నీ కుమారుడూ తిరిగిపోయి నీ బంధువులతో సుఖాన వుండండి. నా తప్పు క్షమించు. అనెను. ఆ వాక్యాలకు కామధేనువు ''ఇట్లా యెందుకు అనుజ్ఞ యిస్తావు; నేను నా మందకుపోయి అచ్చాపచ్చా తీర్చుకుంటూ ఆలస్యంచేసి వచ్చినానని కోపం వచ్చిందేమో! నాకు తెలుసును. ఇక యింటికి పోవలసిందిలేదు. నేను సకల మమతలూ తెగగోసుకుని ఏకచిత్తాన వస్తిని. కాబట్టి నన్ను మన్నించి, భక్షించి మోక్షానకు పంపి సుఖాన వుండుమని వేడుకోగా మృగరాజు పల్కిన వివరం. కామధేనువా! నీవు మహాసత్యసంధురాలవు. నీ సత్యంచేత పాపాత్ముడైన నాకు బుద్ధి వచ్చింది. నిన్ను చంపరాదు. నన్ను రక్షించు. నీవు సాక్షాత్తూ గౌరి, లక్ష్మి, సరస్వతి, అహల్య, అరుంధతి మొదలయిన దేవతలకు సమానురాలవు గాని మరివొకటి కాదు. నీ వంటి పుణ్యాత్మురాలు వుండేనేగాని భూమిమీద నెలకు మూడు వర్షాలు కురువవు. పాడిపంటలు తిన్నగా ఉండవు. ధర్మం నాలుగు పాదాలా నడవదు. కాబట్టి నా ప్రార్థన మన్నించి నీవు సురక్షితంగా వుండి నన్ను రక్షించు తల్లీ! అని వేడుకుంటూ ఉండేటంతలో ఆ సత్యదేవత ప్రత్యక్షమై, కామధేనువుతో యిట్లు పలికెను. కామధేనువా! లోకంలో నరజన్మం యెత్తి చదువులు నేర్చిన పెద్దపెద్ద పేర్లవారే అడుగడుగుకూ ఆడిన మాటలు తప్పుతూ అబద్ధపు సాక్ష్యాలు, అప్రమాణాలు చేస్తూవుండగా, పశుజన్మం యెత్తి

నీవు ప్రాణాపాయం వచ్చినా అబద్ధం ఆడక "ప్రాణానికంటె నిజానికి విలువ యెక్కువ" అనే నీతివాక్యం నిలిపినావు. ఆవు చేలో మేస్తే దూడ గట్టున మేస్తుందా? నీ పుత్రుడున్నూ నీకు తగిన పుత్రుడే. లోకంలో తల్లివంటి దైవం లేదు. నీ బిడ్డ నీతోడిదే లోకం అని చావుకే తెగించి వచ్చాడు. పూపు పుట్టగానే పరిమళిస్తుంది గదా! నాకు చాలా సంతోషం కలిగింది. నా లోకం సత్యలోకానికి మీరిద్దరూ రాతగ్గవారు. కనుక వేంచేయండి. ఇంకా మీరేమి వరం కోరుతారో కోరుకొండి'' అనఁగా కామ ధేనువు అన్న వాక్యం-"అమ్మా! నా పూర్వపుణ్యంవల్ల మీకు నామీద దయకలిగింది కాని నా సత్యం యేపాటిది? ఈ వ్యాఘ్రరాజు నన్నప్పుడు విడిచిపెట్టకపోతే నా సత్యం వెల్లడి కావడానికి వ్యవధి కద్దా! ఇంత పుణ్య స్వభావం పులిజాతిలో యెక్కడా ఉండబోదు. ఇటువంటి యీ వ్యాఘ్రరాజును విడిచిపెట్టి మీ లోకానికి రావడానికి మాకు మనసు రావడం లేదు. ధర్మంగాదు. మాకు అనుగ్రహించిన వరానకు ఈ వ్యాఘ్రరాజుకు కూడా పుణ్యలోకం దయచేయండి" అని వేడగా, ఆ సత్యదేవత సంతోషించి ముగ్గురినీ తన లోకానికి తోడుకొనిపోయెను.



శ్రీరస్తు

బి.ఏ.బి.ఎల్. రెంటాల వేంకటసుబ్బారావు పంతులుగారి

# హెచ్చరిక

ఈ చిన్న పుస్తకములో ఉన్న కథ కొత్తది కాదు. అనేకులు యిదివరకు విన్నదే. కాని, దానిని శ్రీ ప్రభాకరశాస్త్రిలవారు నీతులతో నింపి తెలుంగు మాట్లాడే జనుల కందరికి సులభంగా బోధపడి మనోరంజకముగా ఉండేలాగు వాడుక భాషలో తేట మాటలతో నూతనముగా రచియించినారు. ఈ కార్యము వల్ల వీరు ఆంధ్రలోకానికి మహోపకారులుగా భావింపదగియున్నారు.

భారతం మొదలయిన మహాగ్రంథాలు చదివి పండిత పదవి సంపాదించిన శాస్త్రిలవారు వ్యాకరణ నిబంధనలు పాటించకుండా ఈ కథ వ్రాయడము, యీ ఘనకార్యము ఆంధ్రలోకానికి మహోపకారముగా భావింపదగ్గదని వుగ్గడించడము-యివి కేవలం విపరీతాలుగా కొందరిమనస్సుకైనా తోచడం నిశ్చయము. తెలుగు భాషకు చేటుకాలం వచ్చింది కాబోలునని ముక్కుమీద వేలుపెట్టుకుని కొందరు విస్మయంలోనూ విచారంలోనూ మునిగిపోవడం కూడా నిశ్చయమే. ఈ కారణం వల్లను, ఈ ఫక్కీగా కథవ్రాయడానికి శాస్త్రిల వారికి ప్రోత్సాహం కలిగించిన వాడ నగుటవల్లను, యీ హెచ్చరిక యిచ్చట అవశ్యకంగా చేర్చడం యేర్పడి నది. దీనిని విని భాషాభిమానులు తమ కలవరం మానుదురు గాక !

ఒకటి రెండు సంవత్సరాల నుంచి న్యూసు పేపర్లలోనేమి మీటింగులలో నేమి తెలుగుభాషను గురించి చర్చలున్నూ వాద ప్రతివాదములున్నూ జరుగుతూ ఉన్నవి. నన్నయ్య, తిక్కన్న, యెర్రన్న, పెద్దన్న యిటువంటి పెద్దలు వ్యాకరణనిబద్ధంగా ఉపయోగించిన భాషే తెలుంగు భాష, అదే నేర్చుకోతగినది, ఆ భాషలోనే గ్రంథాలు వ్రాయదగును, తక్కిన భాష గ్రామ్యభాష, అవాచ్యము అప్రశస్తము, వర్జనీయ మిట్లని కొందరు పండితులున్నూ-సామాన్యంగా అందరికీ బోధపడని గీర్వాణానికి భాష అని పేరు పెట్టడం కేవలం హాస్యాస్పదం. కట్టు

బొట్లతో చచ్చి పడివున్నది భాష కానేరదు. ప్రాణముతో పెరుగుతూ ఉన్నదే భాష. అదే గౌరవార్హము. అట్టిదే దేశాభివృద్ధికి ఆధారము- ఇట్లని కొందరు పండితులున్నూ గుద్దులాడుకోవడమేగాక తగవు తీర్చుకోవడానికి కచేరీలకు యెక్కడం దాకా కూడా వచ్చింది ! అజ్ఞానం హరించి అవివేకము శమించుగాక !

ఉన్నమాటంటే ఉడుకుబోతుతనం వస్తుందంటారు. అయినా ఒకప్పుడు అనక తప్పదు. ఇంతకూ ఆకాశవాణికి భయమేమిటి ? ఆమె అన్ని భాషలకూ తల్లి. ఆంధ్రభారతి ఆంధ్రభారతి అని యిక్కడ అందరూ నన్ను మాటలతో పూజిస్తూవున్నారే కాని క్రియలో రొష్టు పెట్టుతూవున్నారు — అని ఆమె మొత్తుకుంటూ వున్నది. అదుగో వినబడుతూ వున్నది ఆమె మొర, వినండి !

ఆకాశవాణి మొర

ఓ నా బిడ్డలారా! నాకు అన్నిభాషలూ ఒకటే అయినప్పటికీ సంగీత సాహిత్యవిద్యల మీద నాకు వుండే ప్రీతిచేత ఆంధ్రభాషను యెక్కువ మక్కువతో ప్రేమించి ఆంధ్రభారతి అనే పేరుతో యిక్కడ నెక్కొని చిర కాలంనుంచి ఘనంగా ఆదరింపబడుతూ వుంటిని. వయసు గడచినకొద్దీ నాకు వన్నెవచ్చి యౌవనం హెచ్చిందిగాని నా రూపలావణ్యాలు యెంతమాత్రం మారలేదు. కాని, యిటీవల పడమటి బిడ్డలతోటి సాంగత్యంవల్ల నా ముద్దుబిడ్డల బుద్ధి చెడి నా యెడల అనాదరణ యేర్పడి నా కళా కాంతులకు కూడా మబ్బు పట్టడం ఆరంభించింది.

అయ్యయ్యో! ఏ దిక్కు నవిన్నా నా బిడ్డల పోట్లాటలే వినబడుతూ వున్నవి. నాకు యేమి దుర్గతి పట్టనున్నదో, ఏమి దుస్థితి రానున్నదో గాని నా పెద్దబిడ్డలే వుపకారమని పేరుపెట్టి నాకు అపకారం చేస్తూవున్నారు.

తంత్రులారా! ఎందుకు ఈలాగు తన్నులాడుకుంటారు ? తూర్పు పడమరల భేదం తెలియకుండా యెందుకు గుద్దులాడుకుంటూ వున్నారు? అజంతభాష, హలంతభాష, పురుషభాష, స్త్రీభాష- ఈ భేదంతో వున్న భాషా తత్వం పడమటిబిడ్డలలో ఎంతటి పండితులకైనా తెలియకపోవడం ఆశ్చర్యం కాదు. వారి పుట్టుకలోనే దానికారణం వున్నది. ఆ రహస్యం తెలియకుండా

వారు బోధించే భాషాతత్వం అన్ని భాషలకూ సమానంగా చెల్లదని మీరు తెలుసు కోలేక వారి పోలికలను మీయందు ఆరోపించుకుని ఎందుకు బొందలో పడుతూ నన్ను పడదోస్తూ వున్నారు? అయ్యయ్యో! ఈ తత్వరహస్యం సంపూర్ణంగా తెలిస్తే మీకు ఖేదంగాని పోట్లాటగాని వుండదుగదా! నేను యెంతని మీతో మొర పెట్టుకుందును? నా మొర మీకు వినబడడం యేలాగు ? వినపడకపోతే విని తెలిపే మొనగాడెవడున్నాడు? తెలిపించి నా చింతతీర్చే నాథుడెవడున్నాడు ? అయ్యో! అంతా నాకు అయోమయంగా వున్నది!

అజంతభాష, హలంతభాష, పురుషభాష, స్త్రీభాష, వీటికిగల భేదము—భాషయొక్క ప్రాణము, శరీరము, బీజము, క్షేత్రము, స్వరప్రస్తారము, మాత్రాప్రస్తారము, గణప్రస్తారము, నానాజాతి వృత్తప్రస్తారము, వీటియొక్క తత్వరహస్యములు .— భాషయొక్క మాధుర్యము, గానయోగ్యత, యివి దేని ననుసరించి వుండేదీ, యెట్టి భాషలు సంగీత సాహిత్య విద్యల సంపూర్ణ ప్రస్తారమునకు యోగ్యములో, స్త్రీపురుషాక్షర సంజ్ఞల యొక్క సంయోగము, ఐక్యము, ప్రత్యేకరూపము — ఎట్టిభాషలో పదములు విడివిడిగా వుండునో, యెట్టి భాషలో జడగా అల్లుకొని పోవునో, యేమి కారణమో — యెట్టి భాషలో ముందుకే సూటిగా అన్వయమో, యెట్టి భాషలో ముందుకు వెనుకకు దుమికిదుమికి అన్వయమో, యే స్వాభావిక ధర్మంవల్ల యిది యేర్పడుతుందో - ఈ మొదలైన తత్వరహస్యములు తెలిస్తే అన్ని భాషలకూ ఒకటే వర్ణమాల యేర్పాటు చేస్తామని, అన్ని దేశాలకూ ఒకటే భాష యేర్పాటు చేస్తామని, అన్ని భాషలను వుచ్చారణ ప్రకారమే వ్రాయవలసినదని- యిట్టి పిచ్చివాదములు వుండవుగదా ! నా బిడ్డలు భాషాభివృద్ధి పేరు చెప్పి అవలంబిస్తూ వున్న వృథా ప్రయత్నములున్నూ వృథా వ్యయమున్నూ తప్పిపోవునుగదా ! ఏమి చేతును ? ఎంతని మొరపెట్టుకొందును ? నా చింత తీరే మార్గము యేమి వున్నది ? అయ్యో యేమిగతి !

ప్రతి భాష యందున్నూ వ్యవహరించడములో—అనగా వాడుకలో— కొన్ని మార్పులు కలగడం స్వాభావికమై వున్నది. ఈ మార్పులు బిడ్డలవల్ల, పామరులవల్ల, సామాన్యజనులవల్ల, ఒక విధంగాను - పెద్దలవల్ల, బుద్ధిమంతుల వల్ల, పండితులవల్ల, మరివొకవిధంగాను-కలిగింపబడడం కూడా స్వాభావికమే.

ఇంతేకాక మొట్టమొదట ఒకరితో వొకరు నోటి మూలంగా మాట్లాడుకొనడానికి యేర్పరుచుకోబడిన పదములు వ్రాతమూలంగా చదువుకుని గ్రహించుకొనడానికి ఉపయోగింపబడడంవల్ల మరికొన్ని మార్పులు కూడా భాషలో తటస్థిస్తూ ఉన్నవి. ఈ చెప్పబడ్డ అన్ని మార్పుల విషయంలో అజంత భాషలకున్నూ హలంతభాషలకున్నూ పురుష భాషలకున్నూ స్త్రీ భాషలకున్నూ వాటి స్వాభావిక ధర్మమునుబట్టి చాలా భేదం యేర్పడుతూ వున్నది. దీని వివరం గ్రహించుకోక పోవడంవల్లనే పోట్లాటలు, గుద్దులాటలు, గుడ్డి వాదములు, చెడ్డ భేదములు సిద్ధిస్తూ ఉన్నవి. ఇది టూకీగా చెప్పదగిన విషయము కాదు. అందరికీ సులభంగా బోధపడే విషయమున్నూ కాదు.

ఏ భాషలోనైనా సరే పుట్టుకలో యేర్పడ్డట్టుగానే పదాలు స్పష్టంగా సంపూర్ణంగా ఉచ్చరిస్తూ మాట్లాడితే ఆలస్యం అయి వ్యవహారం కడ తేరదు కాబట్టి వాడుకలో అనేక పదాలయందు స్వరలోపమున్నూ అక్షరలోపమున్నూ కలుగుతుంది. వ్రాసేటప్పుడు నిదానంగా వ్రాయవచ్చును గనుక యీ లోపం అవసరంలేదు. మరిన్నీ సామాన్యజనులుగాక బుద్ధిమంతులున్నూ పండితులున్నూ వ్రాసేటప్పుడు, కొత్తకొత్త శబ్దజాలం కల్పించి సమస్తమైనవారు నిదానంగా చదివి నెమ్మదిగా నేర్చుకుని జ్ఞప్తియందుంచుకోవలసిన విషయములున్నూ గంభీరమైన విషయములున్నూ తెలుపుతూ గద్యములు, పద్యములు, పదములు మొదలయిన కవితలతో గ్రంథాలు రచియిస్తారు. ఈ ప్రకారంగా మాటభాష, వ్రాతభాష, గ్రాంథికభాష అని మూడు తెరగులు ఏర్పడుతున్నవి. సామాన్యంగా లోకంలో సంభాషణ, వుత్తర ప్రత్యుత్తరాలు, వ్యవహార విషయములు, మొదలయినవాటి సంబంధంలో ఉపయోగింపబడుతూ ఉన్నందున మాటభాషను వ్రాతభాషను కూడా వాడుకభాష అని చెప్పవచ్చును. గ్రాంథిక భాషలో సంభాషణగాని, ఉత్తర ప్రత్యుత్తరములుగాని, వ్యవహారములుగాని జరుపరు. అయితే యీ సందర్భంలో అజంత భాషలకున్నూ హలంత భాషలకున్నూ వాటి స్వాభావిక ధర్మమునుబట్టి కొండంత భేదం ఏర్పడుతూ ఉన్నది. హలంత భాషలు, స్త్రీ భాషలు, వీటి విషయంలో ఒకటే కాలపు వాడుక భాషకు గ్రాంథిక భాషకు ఉచ్చారణలో ఎంత భేదంవున్నా వ్రాతలో ఉపయోగించే అక్షర సంజ్ఞలలో భేదం ఉండదు. ఇది స్వాభావిక ధర్మమునుబట్టే తటస్థించును. ఈ కారణంవల్ల హలంత భాషలో గ్రంథాలు చెవులతో విన్నప్పుడు

అర్థం అవుతూ ఉన్నప్పటికీ కంటితో గ్రహించి చదవడం కష్టంగా ఏర్పడుతుంది. కాబట్టి యావజ్జీవము, ఉచ్చారణ నేర్చుకుంటూ మార్చుకుంటూనే ఉండవలెను. పైగా కాలానుగుణ్యంగా భాషా స్వరూపం కూడా మార్పు చెందుతూ ఉంటుంది గనుక సామాన్య సంభాషణలోను, సాధారణపు వ్రాతలలోను, గ్రంథాలలోను, వన్నె భేదం, వైఖరీ భేదమే గాని భాష ఒకటిగానే కనిపిస్తూ నానాటికి కలిగే మార్పులు కిందికీ పైకీ కూడా వ్యాపిస్తూ వుండడంవల్ల భాష జీవించినట్టుగా ఏర్పడుతుంది. ఇంక అజంత భాషలు, పురుష భాషలు - వీటి విషయంలో ఎట్లా వుంటుందంటే-స్వరలోపాది కారణములవల్ల కలిగే మార్పులు చాలా అధికమగుటచేత సామాన్యంగా ఉపయోగింపబడే మాటభాషకున్నూ సామాన్యంగా ఉత్తర ప్రత్యుత్తరములలోను వ్యవహారంలోను ఉపయోగింపబడే వ్రాత భాషకున్నూ గద్యపద్యాది కవిత్వాలయందు ఉపయోగింపబడే గ్రాంథిక భాషకున్నూ చాలా వ్యత్యాసం ఏర్పడడమే గాక ఈ జాతిభాషలు వాటి స్వాభావిక ధర్మమును బట్టి వ్రాసిన ప్రకారమే ఉచ్చరించి చదువబడవలసిన కారణంవల్లను, గురులఘు ప్రస్తారములతో పద్యాది కవిత్వములు గణబద్ధమై లేశమైనా మార్పుచెందడానికి వీలులేకుండా బిగిసివుండే కారణంవల్లను, మాటభాష వ్రాతభాష గ్రాంథికభాష అని మూడు స్వరూపములుగా ఏర్పడుతూ వున్నవి. ఈ మూడింటియొక్క తారతమ్యమున్నూ ఉపయోగమున్నూ విలువయున్నూ తెలుసుకోలేకనే హలంత భాషలయందువలె ఒకటే జీవభాష ఏర్పరచవలెనని ప్రయత్నించడం, గ్రాంథిక భాషను దూషించడం, వ్రాతభాషను ఆదరించకపోవడం, మాటభాషను గ్రామ్యమని నిందించడం-ఇతంతా కేవలం అజ్ఞానమును సూచిస్తున్నది. అయ్యో! నా పెద్ద బిడ్డలే నాకున్నూ నా చిన్న బిడ్డలకున్నూ అపకారులైనారా! ఏమి విపరీతకాలం వచ్చింది!

గ్రాంథికభాషను పూజించే నా దొడ్డబిడ్డలారా! గ్రామ్య భాషను నిరసిస్తారే! అది నా చిన్నిబిడ్డలు, పేదబిడ్డలు మాట్లాడే భాష కాదా! నా చిన్నిబిడ్డల వచ్చీరాని పలుకులు నాకు ముద్దుగా ఉండవా! ఎందుకు నిందిస్తారు? మీ చెవులకు కూడా ఆనందకరంగా ఉండబట్టేగదా గ్రామ్యభాషలో ప్రసంగాలున్నూ పదాలున్నూ మీ గ్రంథాలలో అక్కడక్కడ వుపయోగించి హాస్యరసం అనుభవిస్తారు! మీకు గ్రామ్యభాషవల్ల హాస్యరసం వుదయించి ఆనందం కలిగినట్టే అల్పజాతుల బిడ్డలకు వాళ్ల సుద్దులలో మీ భాష ఉపయోగించిన సందర్భమందు హాస్యరసం వుదయిస్తుంది. వాళ్ల సుద్దులున్నూ పదాలున్నూ పాటలున్నూ వాళ్ల గ్రంథాలు. మీ

కవిత్వాలు మీ గ్రంథాలు. వాళ్ళ గ్రంథాలు వినగూడదు, వ్రాయగూడదు, చదువగూడదు, అవి గ్రంథాలు కావు, మా గ్రంథాలే గ్రంథాలు అని యెందుకు పిచ్చివాదాలు చేస్తారు?

తెలుంగుభాష మాతృభాషగా గల జనులు 2,30,00,000 (రెండు కోట్ల ముప్పైలక్షల) మంది ఉన్నారు గదా! వీరిలో మాట రానివాళ్ళ కింద 30 లక్షలను తీసివేయండి. తెలుంగు మాట్లాడే తక్కిన రెండుకోట్ల మందిలో యెందరు గ్రాంథికభాషలో ఉత్తర ప్రత్యుత్తరాలు, వ్యవహారాలు జరుపుకుంటారు? ఎందరు భారత భాగవతాది గ్రంథాలు చదువుతారు? ఇది కొంచెం తలచుకొనండి. అప్పుడు అంతా మీకు స్పష్టంగా బోధపడుతుంది.

తెలుంగుభాష మాట్లాడే రెండు కోట్లమంది జనులలో గ్రాంథికభాష మాట్లాడేవారు వొక్కరుకూడా లేరని చెప్పవచ్చును. ఎవరైనా ఉంటే వారు మహా మహా మహా పండితులే! పెండ్లాముతోను, బిడ్డలతోను, చాకలివాళ్ళతోను, మంగలి వాళ్ళతోను, భారతాదిగ్రంథముల భాష మాట్లాడే మహానుభావుడు వుంటే ఆయన గారి గొప్ప మెచ్చుకోవచ్చును. తర్వాతి మాట- ఈ చెప్పిన రెండుకోట్ల మందిలో భారతాది గ్రంథముల భాషలో ఉత్తరప్రత్యుత్తరములున్నూ జరుపుకునే మహానుభావు లెందరున్నారు? ఒకవేళ వున్నప్పటికీ వ్యవహారములు కొనసాగునా? నా దొడ్డబిడ్డలలో కొందరు బుద్ధిమంతులు సంధులు విడగొట్టి, జడలు చిక్కుదీసి, సులభశైలిలో గ్రాంథిక భాష ఉపయోగిస్తూ మాట్లాడగలరు, వ్రాయగలరు. నిజమే, అలాగు చేయగలవారు వందలుగాని వేలు లేరు. వారి వ్రాతలుకూడా లక్షమంది కంటె యెక్కువమందికి బోధపడజాలవు. తక్కిన 199 లక్షల మంది గతి ఏమికావలసినది? గ్రాంథికభాష చదివితేను, వింటేను అర్థం చేసుకోగలవారు లక్షమంది కంటె యెక్కువ లేరని మీకు స్పష్టంగా బోధపడవలెనంటే ఆయా జిల్లాలు తాలూకాలు గ్రామాలు వీధులు యిండ్లు గుడిసెలు- యీ ప్రకారంగా ఆంధ్రదేశంలో వొకమూల నుండి వొక మూలకు మీ మనోదృష్టి తిప్పిచూడండి ! మనస్సుతో చూడకుండా వూరికే నోటితో మాట్లాడకండి ! మనోదృష్టి వ్యాపింపజేసి చూస్తే ఆంధ్రదేశములో యెక్కడగాని మాట్లాడుకొనడానికిన్నీ సామాన్యపు వ్రాతలకున్నూ వ్యవహారాలకున్నూ సంధులు విడగొట్టి సులభ శైలిగల గ్రాంథిక భాష కూడా

ఉపయోగించబడడం లేదనీ ఉపయోగించడానికి సాధ్యం కాదనీ స్పష్టంగా బోధ పడగలదు. సులభ శైలి అయినా కఠిన శైలి అయినా గ్రాంథిక భాష దొడ్డ గ్రంథాలకే ప్రయోజనము. అనగా కట్టుబాట్లకు లోబడి మార్పులు చెందకుండా ఉండే ప్రౌఢమయిన శబ్ద జాలము మూలమున భక్తి, ముక్తి, నీతి, విజ్ఞానము ఆనందము మొదలయిన సార్వకాలిక విషయములను తెలిపే గద్య పద్య కావ్యములను కల్పించడమే గ్రాంథిక భాషయొక్క వుపయోగము. ఎంత సులభశైలిని వ్రాసినా, ఒకటి రెండు లక్షల మందికి మాత్రమే ఈ గ్రంథముల వుపయోగము. తక్కిన 199 లక్షల మందిని యే గ్రంథాలు చదువుకొమ్మన్నారు? గ్రాంథిక భాష బంగారమే. ఎన్నో వన్నెలు ఉండవచ్చును గాక ! బంగారు బంగారే. గ్రాంథిక భాషే భాష, తక్కినది భాష కాదు. భారతాది గ్రంథములు తప్ప తక్కినవి గ్రంథములు కావంటే, తెలుంగు భాష తెలుంగు గ్రంథాలు లేనట్టే భావించుకోవలసి వస్తుంది. భారతాది గ్రంథములు అర్థంకాని నా 199 లక్షల మంది బిడ్డలు గ్రంథాలు లేనివారు, చదువురానివారు అవుతారు సరేగదా! వారు తెలుంగు మాట్లాడగల వారైనప్పటికీ మూగవాళ్లే మృగములే అని చెప్పవలెను. ఈ వాదం మీకు బాగా ఉన్నదా !

భారతాది గ్రంథములు చాల దొడ్డ గ్రంథములు, ప్రశస్తమైన గ్రంథములు అని అందరూ వొప్పుకుంటారు. చక్కగా చెక్కి నునుపుచేసి వన్నె పెట్టిన మానుతోను శిలతోను నిర్మించిన శాశ్వత సౌధములు రమ్యముగా ఉండడం ఆశ్చర్యమా ? నవరత్నాలు చెక్కిన బంగారు ఆభరణాలను మెచ్చుకోనివారు వుంటారా ? పట్టు బట్టలు, జరీ బట్టలు, యివి అందరికీ కన్నుల పండువుగానే వుండును. అయితే సమస్తమైనవారు సౌధములే కట్టవలెను— మిద్దెలు, మేడలు నిర్మించుకొనే కాపురముండవలెను. సామాన్యపు ఇండ్లు కట్టగూడదు- పూరి యిండ్లు, గుడిసెలు బొత్తిగానే వుండగూడదు- అందరూ రత్నాభరణములు, బంగారు ఆభరణములు, వీటినే ధరించవలెను- అన్ని వస్తువులు, అన్ని పనిముట్లు బంగారముతోనే చేయవలెను- పెద్దలూ పేదలూ అందరూ పట్టుబట్టలు, జరీ బట్టలు, వీటినే ధరించవలెను. అన్ని వేళలయందు వాటినే కట్టుకోవలెను. అన్ని సమయములయందు రూప నిర్బంధములతో నిర్మించిన దుస్తులే ధరించుకోవలెను- ఈలాగు యేర్పాటుచేస్తే లోకము జరుగుతుందా ? సౌఖ్యంగా వుంటుందా ? మరియెందుకు గ్రాంథిక భాషను వృద్ధి చేయడము అని పేరుపెట్టి దాని

కట్టుబాట్లను కొద్దికొద్దిగా చెరిపి పాడుచేసి దాని అందమును మాధుర్యమును ధ్వంసం చేస్తారు? గ్రాంథిక భాషను సడలించి, పలుచన చేసి, చులకన చేసి సామాన్య కార్యములకు వుపయోగపరచవలెనని యెందుకు వృధా ప్రయత్నము చేస్తారు? ఎందుకు పరిశుభ్రమైన వాడుకభాషను నిందిస్తారు? బంగారుతో నీళ్ళ కాగులు నిర్మిస్తారా, గడ్డపారలు చేస్తారా! చేస్తేకూడా అవి బాగా ఉపయోగ పడునా? గ్రాంథిక భాష దొడ్డభాష, పూజనీయమైన భాష. అది లోకవ్యవహార ములయందు వుపయోగపడదు. రెండు కోట్ల మంది ఆంధ్రజనులలో 199 లక్షల మందికి అది లభింపనే లభింపదు. కాబట్టి, నా దొడ్డబిడ్డలారా! నా మొర కొంచెము చెవిని పెట్టండి! గ్రాంథికభాష యొక్క తత్వము తెలియక దానిలోకి పిచ్చి మార్పులు, కూర్పులు తెచ్చిపెట్టి, పరిశుద్ధముగానున్న నా దివ్యసౌధములను పాడుచెయ్యకండి. అగ్రగణ్యులైన మహాకవులు అప్పుడప్పుడు కల్పించే, కూర్చే కొత్త అందములతో తృప్తిచెంది మీ బుద్ధి అంతా వాడుక భాషను ప్రసిద్ధిలోకి తెచ్చి, పరిశుద్ధపరచి, వృద్ధిపరచుటయందు వుపయోగించండి.

వాడుకభాష అందరికీ కావలసిన భాష—అందరు జనులు సామాన్య సంభాషణయందు, ఉత్తర ప్రత్యుత్తరాలయందు, లోక వ్యవహారాలయందు ప్రతిదినం ప్రతి నిమిషం వుపయోగిస్తూవున్న భాష. వాడుకభాషను కాగితముమీద నిందించే వారుకూడా యింట ఆలుబిడ్డలతో మాట్లాడేది వాడుకభాషే! మరెందుకు వాడుక భాష అంటే నిందింపవలెను? యేల సిగ్గు పడవలెను? సామాన్యజనులు, పామరులు —నా బిడ్డలలో 199 లక్షలు వీరే — వీరి నిమిత్తము కల్పింపబడే గ్రంథాలు వాడుకభాషలోనే ఉండవలెను. ప్రస్తుత కాలములో అన్యసంబంధమువల్ల లభిస్తూ వుండే జ్ఞానము వాడుకభాషలోనే వెల్లడి కావలెను. కొత్త కొత్త చరిత్రలు, శాస్త్రములు, కథలు, హాస్యములు, పాటలు, పదములు—యివన్నీ ప్రజలకు, బిడ్డలకు బోధపడవలెనంటే సంకరముచేసి పాడుచేసిన గ్రాంథిక భాషలోగాక, నిజమైన, పరిశుద్ధమైన, మనోహరమైన వాడుకభాషలోనే ఉండవలెను. ఈ వాడుక భాష అనే ప్రత్యేక భాష అవిచ్ఛిన్నముగా యేర్పడివుండడము అజంత భాషల యొక్క, పురుష భాషలయొక్క గొప్ప భాగ్యము. వార్తాపత్రికలను నా బిడ్డలు లక్షలకొలది చదివి అభివృద్ధికి రావలెనంటే వాటిని వాడుకభాషలోనే వ్రాయ వలెను. కొంచెముగా గొప్పగా సడలించిన గ్రాంథికభాష కూడా జనసామాన్యము నకు బోధపడదు. కాబట్టి గ్రాంథికభాషను కనికరములేక వంకరటింకరలుగా

తిప్పి తిప్పలుపెట్టి, తప్పులుకూర్చి, పిచ్చిపిచ్చి శబ్దజాలమును కల్పించి గ్రాంథిక భాషను, వాడుకభాషను రెంటినీకూడా పాడుచేయకండి. నాదొడ్డబిడ్డలలోకొందరు పెద్దవ్రాతలని పేరుపట్టి గ్రాంథికభాషలో పిచ్చివ్రాతలను వ్రాసి నాకు విచారము కలిగిస్తూ వున్నప్పటికీ, కొందరు దొడ్డగ్రంథాలు కల్పించి నా గర్వము పెంపు చేస్తూవున్నారు. ఇది నాకు పరమానందమే. కాని, వీరు సమర్పించే పరమాన్నము నా బిడ్డలలో లక్షమంది కూడా ఆరగించి అనుభవించడం లేదు. పరిశుద్ధమై రుచి కరముగా వుండే అంబలే 199 లక్షలమంది బిడ్డలకు ఆరోగ్యకరమైన ఆహారము. ఇది అత్యావశ్యకము. దీనినికూడా సంపాదించగలవారు నా దొడ్డబిడ్డలే. ముందటి కాలంలో కొందరు బుద్ధిమంతులు వాడుక భాషలో కథలు, కీర్తనలు, పాటలు, పదములు, హాస్యములు మొదలైనవి కల్పించివున్నారు. గంగా వివాహము, కుసలాయకము, బొబ్బిలికథ, దేశింగురాజుకథ, క్షేత్రయ పదములు, సారంగ పాణి పదములు, లంకాయాగము— మొదలైనవి నా బిడ్డలకు ప్రాణములు. వాడుక భాషలో అనేక గ్రంథములు నోటి పాఠాలలోను తాటాకుల పుస్తకాలలోను పై ప్రాణాలతో నిలిచియున్నవి. వీటిని రక్షించి చక్కగా ముద్రించి సర్వజనులకు సులభంగా దొరకేటట్లు చేయడం యెంతో పుణ్యకార్యము. ఈ కాలంలో కూడా కొందరు బుద్ధిమంతులు వాడుకభాషలో హాస్యములు, కథలు, శాస్త్రములు, ధర్మ శాస్త్రములు మొదలైన గ్రంథాలు వ్రాసియున్నారు. ఇవి ప్రతి పల్లెటూరిలో పూజింపబడుతూవున్నవి. కన్యాశుల్కము చదివి సంతోషించని వారుందురా? సంస్కర్తగారి గ్రంథాలలో, వాడుకభాషలో వ్రాసిన హాస్యములేకదా అందరూ చదివి అనందిస్తూవున్నారు. కాబట్టి, దొడ్డ నాయనలారా! విద్వాంసులారా! గ్రాంథికభాషను సంకరముచేసి నా గర్వమును కుంగించక, వాడుకభాషను లఘుమార్గములో వృద్ధిచేసి, పరిశుద్ధిచేసి, మనోహరమైన కల్పనలతో రమ్యము చేసి, జ్ఞానమును ఆనందమును పెంచే సర్వజనోపయోగములైన గ్రంథాలు వ్రాయండి, ముద్రించండి, ప్రచురించండి! చిన్న బిడ్డలు 199 లక్షలమందికి అభివృద్ధిమార్గము యేర్పరచండి! తల్లి ఆశీర్వచనమును పొందండి! శాశ్వతమైన కీర్తిని సంపాదించండి!!

తే.గీ. నోటితో పల్కు వినఁదగు • నుడుఁగు లెట్లు
కాగితముపయి వ్రాయంగ • గర్హ్యములగు?
తప్పు మీయందె కలదని • చెప్పనేల,
మంచినీళ్ళు నిందింతురో • మధువు మరగి?



# నా ఎరుకలో....

[ మణిమంజరి గత సంచిక తరువాయి ]

—డా॥ వేటూరి సుందరమూర్తి

మాది పండిత వంశం. మా నాయనగారికి చిన్నతనం నుండి సాహిత్యం మీద ఎక్కువ మక్కువ. కాలక్రమేణా సాహిత్యం మీద నుండే సహజ అభినివేశంవల్ల, చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి గురు సంపర్కంవల్ల అది దినదినాభివృద్ధి చెందింది. చిన్నతనంలోనే మద్రాసు చేరడం, ఉద్యోగరీత్యా దేశాటనం చేయవలసి రావడం, అనేక ఉద్దండ పండితులతో పరిచయం కలగడం, వీటికి తోడు స్వయం కృషి, నిశితమైన బుద్ధి కుశలత, విమర్శన దృష్టి కలిగి ఉండడం, అచిరకాలంలోనే వారికి సాహిత్య ప్రపంచంలో సముచిత స్థానాన్ని సమకూర్చాయి. 1910 నుండి 1930 దాకా దాదాపు రెండు దశాబ్దాలపాటు సాహిత్యంలో నిర్విరామమైన కృషిచేసి అనేక నూతన విషయాలను లోకానికి అందజేశారు. తొలి దశలో వారి అనారోగ్యం చాలా చీకాకులకు కారణమయింది. కుంభకోణంలోని మాస్టర్ సి.వి.వి. గారి గురు కృపవల్ల స్వస్థత చేకూరి సాహిత్య కృషి కొంత కాలం యథావిధి సాగింది. 1930 నుండి 1940 దాకా సాహిత్య విముఖులై సి.వి.వి. గారి యోగానుష్ఠానంలో నిమగ్నులై అనేక అపూర్వ అనుభవాలను గడించారు. 1939 డిసెంబరులో మద్రాసు ఉద్యోగం నుండి రిటైర్ అయి తిరుపతి శ్రీ వెంకటేశ్వర రిసర్చి ఇన్స్టిట్యూట్ తెలుగు శాఖాధిపతిగా నియమితులవడంవల్ల తిరిగి 1950 ఆగస్టులో వారు చనిపోయేదాకా పది సంవత్సరాలపాటు సాహిత్యానికి తగిన సేవ చేయ కలిగారు. వారి జీవిత కాలంలో నాకు తెలిసిన కొన్ని సన్నివేశాలను ఇక్కడ వివరిస్తాను.

నా చిన్నతనంలో మద్రాసులో ఉన్నప్పుడు గిడుగు రామమూర్తి పంతులు గారు తరచు మా ఇంటికి వస్తూ ఉండేవారు. ఆయన ఆజానుబాహువు. నల్లటి కోటు, తలకి తెల్లటి తలపాగ, మోకాళ్ళదాకా అందుతూ బిళ్ళమడత ఉత్త

రియ్యం, తెల్లని ధోవతితో వారి మూర్తి నేటికీ నా కళ్ళముందు కనబడుతూ ఉంటుంది. ఆయన కోటు జేబులో ఒక పొడుగాటి రబ్బరు గొట్టం ఉండేది. నేను వారితో చిన్న పిల్లవానిగా మాట్లాడడం నాకు బాగా గుర్తు. ఆ రబ్బరు గొట్టం ఒక చివర ఆయన చెవిలో పెట్టుకునేవారు. అవతల చివర నుండి నేనూ మా చెల్లెలు మాట్లాడుతూ ఉండేవాళ్ళం. చాలా తమాషాగా ఉండేది. ఎందువల్ల ఆ గొట్టం ద్వారా మాట్లాడవలసి వచ్చేదో మాకు అప్పుడు బోధపడేది కాదు. ఆ తర్వాత మాకు తెలిసిందేమిటంటే- వారు సవరల భాష మీద పరిశోధన చేయడానికి పర్లాకిమిడి కోయ ప్రాంతాలకు తరచు వెళ్ళివస్తూ ఉండేవారట. అది వన్య ప్రాంతం కావడంవల్ల వారికి అడపాతడపా చలిజ్వరం రావడం, దాని నివారణకు క్వినైన్ అతిగా సేవించడంవల్ల చెముడు రావడం తటస్థించిందట. ఆ గొట్టంలో గూడా బిగ్గరగా అరిస్తేగాని వారికి తిన్నగా వినబడేది కాదు మా నాయనగారూ వారూ మాట్లాడుకుంటున్నప్పుడు చాలా బిగ్గరగా మాట్లాడుకొనేవారు. మాకు వాళ్ళిద్దరు దెబ్బలాడుకుంటున్నారా అని అనిపించేది, నిజంగా గూడా వారు విశ్వసించిన సాహిత్య విషయం మీద వాదోపవాదాలు అంత పట్టుదలతోనూ సాగుతూ ఉండేవేమో! వాటిని గురించి నేనిప్పుడు వివరించి చెప్పలేను. స్థూలంగా భాష, ఛందస్సు, పుస్తక పరిష్కరణ మొదలైన వాటిలో వారు గుర్తించిన అనేక కొత్త విషయాలపై చర్చ సాగుతూ ఉండేది.

ఆ రోజులలో గురజాడ అప్పారావుగారు మద్రాసు వచ్చినప్పుడల్లా నాయనగారికి కబురుపంపి వారున్నచోటుకి పిలిపించుకుంటూ ఉండేవారు. ఒక పర్యాయం మాత్రం వారు గుఱ్ఱపు కోచిబండిలో వచ్చి నాయనగారిని పిలుచుకు వెళ్ళడం లీలగా గుర్తు. వారి మధ్య జరిగిన సంభాషణా వివరాలు మాకంతగా తెలియవు.

అప్పట్లో నెల్లూరు నుండి దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు తరచు మా ఇంటికి వస్తూ ఉండేవారు వారిది శ్రావ్యమైన కంఠం. పద్యం ఖంగ్‌మని సంగీత ధోరణిలో చదివేవారు. మా పినతండ్రులు మా నాయనగారు ఇంట్లోలేని సమయంలో వారిచేత పద్యాలు చదివించుకుంటూ ఆనందిస్తూ ఉండేవారు. పిచ్చయ్యశాస్త్రిగారు తాము వ్రాసిన కవిత్వం నాయనగారికి చదివి వినిపిస్తూ ఉండేవారు. అనేక సాహిత్య విషయాలను గురించి వారిరువురు ముచ్చటించుకుంటూ ఉండేవారు.

కొన్ని బయటపడకూడని విషయాలు గూడా వారు ఆంతరంగికంగా మాట్లాడు కుంటూ ఉండేవారు. అట్టి వానిలో వేదం వెంకట్రాయశాస్త్రిగారి ఆముక్తమాల్యద వ్యాఖ్యానంలోని కొన్ని దొసగులను గురించి గూడాను. వెంకటరాయ శాస్త్రిల వారు సంస్కృతంలో ఉద్దండ పండితులు. వారిమీద నాయనగారికి అమితమైన భక్తి. వెంకటరాయ శాస్త్రిగారికి గూడా నాయనగారిమీద అమితమైన అభిమానం. ఒక విద్వాంసుడు వయస్సు మీరిన తరుణంలో చేసిన పొరపాట్లను చక్కదిద్ది వారిని నిలబెట్టడం భావితరాల వారిమీద ఉన్న బాధ్యత అని నాయనగారి అభిప్రాయం. వెంకటరాయ శాస్త్రిగారి శిష్యబృందం నెల్లూరులో పాతుకుఉన్నది. పిచ్చయ్య శాస్త్రిగారికి వెంకటరాయ శాస్త్రిగారి వ్యాఖ్యానాలలోని లొసుగు లను గురించి బాగా తెలుసు. వీటిని పురస్కరించుకొని వెంకటరాయ శాస్త్రిగారి అనంతరం వారి శిష్యవర్గానికి పిచ్చయ్యశాస్త్రిగారికి మధ్య వాదోప వాదాలు చెలరేగాయి. బద్ధశత్రువుల క్రింద ఒకరినొకరు చూస్తూ ఉండేవారు. నాయనగారు ఎంత వారించినా నెల్లూరిలోని వాతావరణం పిచ్చయ్యశాస్త్రిగారిని రంగంలోనికి ఈడ్చింది. వెంకట్రాయశాస్త్రిగారి వ్యాఖ్యానాలలోని లోపాలనన్నీ ఎత్తిచూపుతూ నిందాపూర్వకంగా పుస్తకాలు వెలువడడందాకా వచ్చింది. ఈ వ్యవహారమంతా నాయనగారికి నచ్చలేదు. పరోక్షంగా వానిని వారిస్తూ పిచ్చయ్య శాస్త్రిగారికి కబుర్లు చేరుతూ ఉండేవి. వేదంవారి వ్యాఖ్యానాలమీద పిచ్చయ్యశాస్త్రి గారి విమర్శ గ్రంథం వెలువడింది. వారు దానిని నాయనగారి అభిప్రాయార్థం పంపారు. దానిలోని తప్పులను ఎత్తిచూపిస్తూ, లోపాలు సహజమనీ, ఇకనైనా పరస్పరం నిందారోపణలు ఆపడం మంచిదని పిచ్చయ్యశాస్త్రిగారికి సలహా ఇస్తూ వ్రాశారు. పిచ్చయ్యశాస్త్రిగారి విమర్శగ్రంథంలోని తప్పులు వారి ప్రత్యర్థుల చేతు లలోబడి వ్యవహారం మరీ విషమించింది. ఈ సమయంలో నాయనగారు తిరుప తిలో ఉన్నారు. పిచ్చయ్యశాస్త్రిగారు నాయనగారిని చూడడానికి వస్తూ ఒక వీశడు వేగించిన జీడిపప్పు తీసుకువచ్చారు. పిచ్చయ్యశాస్త్రిగారి ఉద్దేశం నెల్లూరి పరిస్థితి వివరించి తనను సమర్థించుకుందామని. కాని వ్యవహారం ఇంకో విధంగా తయా రైంది. వారు రావడంతోనే నాయనగారు "నీ పైత్యానికి ఈ జీడిపప్పు నిదర్శనం ఇక నాకేమీ చెప్పవద్దు" అని అన్నారు. పిచ్చయ్యశాస్త్రిగారు చాలా సంకట పడి అతృప్తితో వెళ్లడం జరిగింది. కొన్నాళ్ల తర్వాత నేను బెజవాడ వెడుతూ ఉంటే రైలులో పిచ్చయశాస్త్రిగారు కలిశారు. వారు నాతో "మీ నాయనగారు

లబ్ధయశస్కులు. వారికి నాబాధలు తెలియవు. నన్ను వాళ్లు కాకి పొడుస్తున్నట్లు పొడుస్తున్నారు. ఈ పరిస్థితులలో వాళ్ల మీద నేను ధ్వజమెత్తక తప్పలేదు. మీ నాయనగారు నా స్థితిలో ఉంటే గాని వారికి నా బాధ అర్థంకాదు" అని నిష్ఠూరంగా మాట్లాడారు. ఈ వ్యవహారంవల్ల వీరిద్దరి మధ్య కొంత పొరపొచ్చాలు ఏర్పడ్డా ఒకరి మీద మరొకరికి గౌరవం ఏ మాత్రం కొరవడలేదు. మా నాయనగారు పోయిన తర్వాత గూడా పిచ్చయ్యశాస్త్రిగారు హైదరాబాదు వచ్చినప్పుడు ఒక పర్యాయం మా ఇంట్లోనే బసచేశారు. నేటికీ పిచ్చయ్యశాస్త్రి గారితో మా సాన్నిహిత్యానికి ఏ విధమైన కొరత లేదు. [ఇటీవలనే శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు పరమ పదించినారు. వారి మృతి పట్ల మా సంతాపమును తెలియజేస్తున్నాము].

1929 ప్రాంతాలలో జరిగిన ఒక ముఖ్య సంఘటన నాయనగారికి సాహిత్యం మీద కొంత విరక్తి కలిగించింది. అంతకుముందు కొంతకాలంగా శాసన విషయాలనుగురించి పరిశ్రమిస్తూ కొన్ని శాసనాలను గూడా పరిష్కరించి ప్రచురించారు. అప్పటికే ఇండియన్ ఆంటిక్వేరిలో (ఫ్లీటు) అహదనకరతామ్రశాసనంయొక్క నిర్దుష్టమైన ఎస్టాంపేజీని ముద్రించారు. దానిలోని విషయం దురూహ్యంగా ఉండడం వల్ల వివరణ ఎవరికీ కొరకుడుబడని స్థితిలో ఉండింది. నాయనగారికి ఇంగ్లీషుతో పరిచయం తక్కువ. తెలుగు లిపి పరిణామాన్ని శాసనాల ఒరిజినల్స్ చదువుతూ, గుర్తిస్తూ వచ్చారు. వీటి పర్యవసానం అహదనకర తామ్ర శాసన వివరణ. అందులో ఒక వింత అక్షరాన్ని గుర్తించి, దానిని లోగడ ఇతరులు ఏ విధంగా చదివింది, దానిని ఏ విధంగా చదవవల్సింది, ప్రస్తుత శాసనంలో ఆ విధంగా ఆ అక్షరాన్ని చదివితే అర్థ వివరణ కుదరడం గుర్తించి దానిమీద భారతిలో ఒక వ్యాసం వ్రాశారు. దీనిని పురస్కరించుకొని వాదోపవాదాలు చెలరేగాయి. మ. సోమశేఖరశర్మ గారు, నే. వెంకటరమణయ్య గారు వ్యక్తిగత దూషణలతో నాయనగారి మీద విరుచుకుపడ్డారు. సారాంశం: విశృంఖలంగా ఇష్టం వచ్చినట్లు శాసన అక్షరాలను తీసివేసి, చేర్చి, కాలానుగుణంగా గుర్తిస్తూ వచ్చిన అక్షరాల గుర్తింపును తారుమారు చేసి, శాసన లిపిమీద ఏ మాత్రం అధికారం లేనివాళ్లు తప్పుత్రోవ ననుసరిస్తున్నట్లు దుయ్యబట్టారు. దీనికి నాయనగారు తిరిగి బదులు వ్రాశారు. కాని ఆ తర్వాత అంతరుద్భోధం వల్ల వారి విమర్శలకు బదుళ్లు వ్రాయక సాహిత్య రంగానికి పూర్తిగా దూరమయ్యారు. శాసనానికి నాయనగారు ఇచ్చిన అర్థ వివరణకు ఎవ్వరు వ్యతిరేకించకపోయినా ఆ శాసనపు లిపిపై చాలాకాలం వాదోపవాదాలు చెలరేగుతూనే ఉండేవి. చాలా

కాలం తర్వాత సోమశేఖరశర్మ గారు వారి వైఖరిని వివరిస్తూ, వారిద్దరి మధ్య ఉన్న అభిప్రాయ భేదం లిపి వివరణను గురించేగాని శాసన వివరణను గురించి కాదని, ఆ అభిప్రాయ భేదం వ్యక్తం చేయడం నాయన గారికి కష్టం కలిగించిందని అనేకసార్లు చెప్పడం నేను విన్నాను.

నేలటూరి వెంకటరమణయ్యగారు తర్వాత చాలా కాలానికి మిత్రులుగానే ప్రవర్తించేవారు. మద్రాసు యూనివర్సిటీ "వెలుగోటి వారి వంశావళి"ని ప్రచురించడానికి ముందు గ్రంథపాతాలతో దురూహ్యంగా ఉన్న ఆ వంశావళి ప్రతిని నాయనగారికి పంపి సంస్కరింపించుకొన్నారు. అది అందినట్లు కృతజ్ఞత తెలుపుతూ తర్వాత ఉత్తరం గూడా వ్రాశారు. ఆ తర్వాత నెలరోజులకే మా నాయనగారు చనిపోయినారు. తిరుపతి నుండి మేము హైదరాబాద్ రావడం జరిగింది. వెంకటరమణయ్యగారు గూడా మద్రాస్ యూనివర్సిటీ ఉద్యోగ విరమణాంతరం హైదరాబాద్ చేరుకున్నారు. తరచు విద్యానగర్ బస్‌స్టాండ్ వద్ద కలుస్తూ ఉండేవాళ్ళం. వెంకటరమణయ్యగారు ఒక సమయంలో బస్‌స్టాండ్ వద్ద కలిసినప్పుడు నన్ను సంబోధిస్తూ, "ఏమయ్యా, మీ నాయన అహవనకర తామ్ర శాసనంలో చేసిన లిపి వివరణ సరిగా ఉన్నట్లే అనిపిస్తోంది" అని అన్నారు. నాకు ఆ విషయ పరిజ్ఞానం లేకపోవడంవల్ల ఆయనతో అంతకన్న ఎక్కువ మాట్లాడలేదు.

[ సశేషం ]



# వినోద విమర్శము

సేకరణ-వివరణ

ముదివేడు ప్రభాకరరావు —వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

౧

భారతిలోఁ బయిపేరితో నేను వ్రాసిన వ్యాసమున 'స్నాన శబ్దవిచారము'న కిప్పు డీ క్రింద వ్రాయు నది యనుబంధము.[1] ఆ వ్యాసము వ్రాయునప్పుడు నేనీ క్రింది గ్రంథములను బరిశీలింపక పోయితిని.

రంగరాట్ఛందస్సులో 'ప్రాకృతాదేశయతి' యనుపేర– జ్ఞాధాతువులోని జ్ఞాకు స్నాధాతువులోని స్నాకు 'త' కు, యతులు లక్ష్యము లీయఁబడినవి.

'నా కూర్మినందనమే లాత్మఁదలంచి దేవరకు విజ్ఞాపింప నే వచ్చితిన్'

— వరాహ పురాణము

సీ. తావక నగజల స్నాత పాపహరాయ
నతి మాత్ర సాధన జ్ఞాన దాయ

—ప్రబంధరాజ వేంకటేశ్వర విలాసము

అని యున్నది గనుక తెలియవలెను.

ఇది చూడఁగా నా కెంతో సంతోషమయినది- నా తలఁపు నిది సిద్ధాంతీకరించుచున్నది. ప్రబంధరాజమున రెండు యతులు జ్ఞ– + న–, స్నా + త, ఒక చరణముననే కలవు– ఆతడు, యతి లక్ష్యముగా దీని రచించెను.

ప్రయోగ రత్నాకరమున నీ లక్ష్యములు గూడఁ గలవు.

క. మానవ నాథుఁడు గంగా
స్నానానంతరము సకలదానములు మహా

దీనులగు విప్రకోటికి
సేనగ దయతోడ నిచ్చి శివుదర్శించున్.

—భీమన నరసింహ పురాణము

క. ఆతం డక్కడ సుకృత
స్నాతుండై యేఁగుడేఁ బథమ్మునను మహా
భూత మొకటి యెదుట నిలువ
భీతుఁ గనక వానిఁ జూచి పేర్కొని పలికెన్.

— పెద్దన హరికథాసారము

స్నాతయగు సతిఁగూడు వర్తనము మాని
యన్య సతిఁగూడువాఁడు సామాన్యుఁడంద్రు.

—భాస్కరుని సునందోపాఖ్యానము, ఎత్తుగీతి

ఇందు దీనికి సంయుక్త యతి యని పేరున్నది.

౨

ఎనిమిదియేండ్లకు ముందు గుంటూరు జిల్లాలో మోదుకూరను గ్రామమునకు గ్రంథ పరిశీలనమున కరిగితిని. ఆ గ్రామమున సంపన్నులును వ్యుత్పన్నులును నగు భట్రాజులు గలరు. ఆ నాఁటికే వారి యిండ్లలోఁ బెక్కు తాళపత్ర పుస్తకము లంతరించినవి. ఉన్నవానిఁ గూడఁ గొందఱు నాకుఁ జూపకపోయిరని నా యనుమానము. శ్రీ బల్లం కనకరాజు గారను వారి యింట ముమ్మాఱు, తడవకు రెండేసి, మూఁడేసి గాఁ గొన్ని పుస్తకములఁ జూపిరి. పనికిమాలి పెంటపైఁ బాఱవేయ నున్న విడివిడి యాకులఁ గొన్నింటిని దెచ్చి యిచ్చిరి. అందుఁ గొన్ని యెన్నఁదగిన చాటుధారలున్నవి. సంపన్నులగు మఱియొక రాజుగారి (వారి పేరు మఱచితిని. వారు మేడ యింటివారు.) యింట గ్రంథము లన్నియుఁ జెడిపోగా బాఱవైచిరట! ఆ పాఱవైచిన వానిలోఁ గానవచ్చిన చింపి యాకులలోని వీ క్రింది పద్యరత్నములు!

శా. సాయంకాల నటన్మహా నటజటా చంచద్వియ ద్వాహినీ
స్ఫాయద్వాగ్లహరీ విజృంభణ కళాప్రౌఢుండు సత్కావ్యమున్
జేయన్ ... ... ... ... ... ...
... కెంత దవ్వ రసవత్సాహిత్య సౌహిత్యముల్!

—ఆదినారాయణ చరిత్రము.

సీ. కడుఁజిత్రమిది యన బెడగైన యర్థంబు-తల...విమున్న తలఁప వలయు
... ... ... వినువారి- చెవులకుఁ జల్లగాఁ జేర్పవలయు
పదనికాయంబుతోఁ బ్రాణంబులి...ను- నెలవుల నుండంగ నిలుప వలయు
భాసురాలంకార భంగుల నెడనెడ ... ... ... ...
నొప్పు నెలకొనఁ బద్యంబు చెప్పవలయుఁ
గాక వాకాటులకుఁ జొచ్చి కటము లదర
వదలి శిఖవీడ జెమటలు నుదుటఁ బొడమ
బల్ప ... ...

—భవదూరుఁడు.

సీ. మనమునఁగను విచ్చికను మంచి తలఁపుల- తెఱఁగార వ్రేఁకని తియ్యఁబలుకు
లకు దెల్చి రసములింకక తేటపడ నర్థము ... ... ...
ప్రాణంబు లేర్పడఁ బాకంబు లొప్పారఁ- బదబంధ మమర రూపనము లలర
జాతులు విలసిల్ల సకల లక్షణ సమే-తముగఁ జెప్పిన గవిత్వములు గాక
............బొంత గూర్చిన పోలికఁ బొందు పడని.........
మాటలాడఁ గూర్చి కావ్య నామములు వెట్టి- చదువు చదువులు కవిరాజ సభలు చొరవు.

—శివదేవుఁడు

సీ. ............దడిఁ బర్వుచోఁ-బాఠీన గతి గానఁబడిన కరణ
నేఱు వాఱెడు నెడ నిసుకలో నొకచోట-సోపాన పంక్తులు చూపినట్లు
బల్లి...........................గూడినట్లు
దూలంబు తెలిఁ బుర్వ దొలువంగ నొకచోట- నక్షరాకారత నమరినట్లు

తఱచు మాటలు ఱువ్వుచోఁ దప్పిదారి - యచ్చుపడి వచ్చు మాటలు...
...............పలుకు పలుకున కొనరంగఁ బలుక వలయు

—చదలువాడ యెఱ్ఱాప్రెగ్గడ

శా. సారోదార సమంచిత స్ఫురదురు - స్ఫాయల్లస ల్లాలిత
............స ద్రిప్పి పెట్టుచును శబ్ద ద్రవ్యహీనుల్ సదా
తారుం జెప్పరు మంచుఁ జెప్పికొనుటల్ తప్పే నిరాఘాట వా
క్పౌరభ్య ప్రతిభా విజృంభితులు మెచ్చర్ గాక యాచ.........

—పెద్దనకవి లింగన పురుషార్థ చరిత్ర

అరయం గాకు............................సం
హరణం దద్దయు వాలి సంతతము దోషాకాంక్షుఁడై సజ్జనో
త్కారముం జేరఁగ నోడి దుష్టగతి నిద్రాత్రిం బ్రవర్తిల్లు ని
ష్ఠుర మార్గైక నిరూఢుఁడై కు..................

—చంద్రమౌళి హరిశ్చంద్ర కథ

ఉ. నేరరు కావ్యబంధములు, నేరిమి పట్టు నుతింపఁగాదనా
నేరుతు రెందు దుర్మతులు నిక్కము డట్ల......
............నేరరు శ్రోతలు వెక్కిరింపఁగా
నేరుచుఁ గాక రూప రమణీయత చూచి నుతింప నేర్చునే
వీరర......................

—మారన మార్కండేయ పురాణము

ఉ. మెచ్చుఁడు మెచ్చువచ్చు నెడ.........

—ఈ పద్యము ప్రబంధరత్నావళిలోఁ గలదు.

ఉ. మెచ్చులఁ జేయు చక్కటుల మెచ్చ నెఱుంగక యున్నరిత్తచో
మెచ్చినఁ, గల్మషంబుగల మేరలు, గానక త్రోచిపుచ్చినన్
మెచ్చుట...............యుఁ జేసినన్
మెచ్చరు కావ్య తత్త్వ కృతనిశ్చయు, లాతని శ్రోతగా మతిన్.

కవి.................విభుచేఁ
గవియుం గవిచేత విభుఁడుఁ గడు విలసిల్లున్
రవిచే రుచి రుచిచే రవి.........
రవి రుచి విభవమున నభము రంజిల్లు క్రియన్.

—కూర్మ పురాణము

శా. అంగీకారము ప్రస్తుతింపఁదగదే యార్యానుకూలంబులై
మాంగళ్య ధ్వనులై ప్ర...............
.........నిరర్గళ గళద్గంగా తరంగావళీ
భంగిం బేర్చిన నన్నపార్యుని వచః ప్రాగల్భ్య నిర్వాహముల్.

—యడవల్లి తుర్కరాజు[2]

ఉ. భారలి కుంతలాశి శివభద్రు....................[లం
కారము] కాళిదాసుఁడు వికాసము మాఘుఁడు కర్ణపూర మ
క్రూర చరిత్రుఁడై పరగు కొమ్మయ తిక్కఁడు దర్పణంబు సం
సార సుఖైక వాక్ప్రచుర......వచస్సరసీరుహాక్షికిన్.

—విక్రమసేనము-కవిస్తుతి

క. భువి షడ్రసములు నాలుక
జవిగొనఁగాఁజేసే బ్రహ్మ సత్కృతి వలనన్
జెవి నవరసములుఁ జవిగొనఁ
గవి చేసెను [బ్రహ్మకంటెఁ గవి] యధికుఁడగున్.

—విక్రమసేనము

సీ. చదువఁబో కలయందు సానలు........................
[ధర్మ శాస్త్రముల వేదవ్యాస మునుల నిశ్చయము నందొక కుదుష్టంబువెట్ట
తర్కంబునందు గౌతమునైన సభ నాలుగే.........
...............ద్దంబు తెలఁగని ప్రక్రియ, దీర్చి తెలుప
కావ్యలక్షణముల నలంకారవక్త లారయని చోటు లారసి పేరువెట్టు
...............[ఒప్పుదురు భూమి] దేవత లప్పురమున

—సోమయాజుల విజయసేనము

చ. అమరుల పంటచేలు వివిధాతిథి వర్గము సొచ్చి నిండ్లు
..........................వీగుల యాటపట్లు స
త్యము చెలు లుగ్రకర్మముల యందని మ్రాఁకులపండ్లు సర్వ శా
స్త్రములన..............................భూసురోత్తముల్.

సీ. అనవద్య వేదవిద్యా వితతికి నాలవాలములు జిహ్వాంచలములు
రాజ...........................సరసుల మానసములు
సాధు సత్యవ్రత సౌరభ్యలక్ష్మికి నుచితవాక్యములు పుష్పోద్గమములు
సాదర................................
గా సమస్త మహాధ్వరకర్తృతా వి
భూతి సొంపారి నిఖిల సంపూజ్యులగుచు
నిరుపమాన సద్గుణ గణ...............
...............గండవరపు..........

తునిగిపోయిన యీ పద్యముల యాకులను జూచి నేను మిక్కిలి దుఃఖించితిని. నేను ప్రకటించిన ప్రబంధ రత్నావళిని బోలిన దీ గ్రంథము. అదియు నిదియు వేఱువేఱు గ్రంథములే. శివదేవుఁడు, భవదూరుఁడు మొదలగు వారి గ్రంథము లందుఁ జేరలేదు. ఎన్ని సత్కావ్యములు మన్నయిపోయినవో!- పై కవులఁ గూర్చి యించుకంత పరిశీలనము—

1. ఆదినారాయణ చరిత్రము-ఇందు గ్రంథకర్త పేరు గానరాదు. కాని లక్షణగ్రంథములందు—

ఉ. శ్రీయుత లోచనోజ్జ్వల మరీచులు భాను మరీచి విస్ఫుర
త్తోయజ కాంతి తోడఁ దులఁదూఁగెడు పచ్చని పట్టుఁగట్టి య
త్యాయత శంఖ చక్రరుచిరాసి గదాధరుఁ డేఁగు దెంచె నా
రాయణుఁ డార్తరక్షణ పరాయణుఁ డా కరిరాజు పాలికిన్.

అను పద్య మీ గ్రంథములోనిదిగా నుదాహృతము. దీని కర్త కవి రాక్షసుఁడని కలదు.

## భవదూరుఁడు

కవిస్తుతులలోఁ గొంద ఱీ కవిని స్తుతించిరి. ఈ కవి కృతి యేదో? విద్యానగర రాజగు ప్రథమ బుక్కరాయల కొడుకు భవదూరుఁ డొకఁడు గలఁడు. ఆతఁ డీతఁడే యగునేమో!

## శివదేవుఁడు

ఈతడు కాకతీయ గణపతిదేవునకు, రుద్రమదేవికిని మంత్రి సత్తముడు. పురుషార్థసారమను కృతిని రచియించెను. శ్రీ రామకృష్ణకవిగారు ప్రకటించిన సకల నీతి సమ్మతమునఁ బెక్కు పద్యములు పురుషార్థసారములోనివి గలవు. 'శివదేవ ధీమణీ!' యని మకుటము గల పద్యములు గొన్ని ప్రయోగ రత్నాకరమునను, బాలబోధచ్ఛందమునను 'శివదేవయ్య శతక' మనుపేర నుదాహరింపఁబడినవి. ఆ శతకమును గూడ నీతఁడే రచించియుండవచ్చును. ఇక్కడ దొరికిన పద్యము పురుషార్థసారమందలిదేమో!

చదలువాడ యెఱ్ఱాప్రెగ్గడ : ఈతఁడే భారతారణ్యపర్వశేష హరివంశాది కర్త-వీరి యింటిపేరు చదలువాడయే కాని ఏర్చూరి కాదు-ఇందు దొరికిన పద్యమాతని రామాయణ మందలిదేమో!

## పెద్దన కవి లింగన

ఈతనిగూర్చి నాకేమియుఁ దెలియరాలేదు.

## చంద్రమౌళి

ఈతఁడు హరిశ్చంద్ర కథ రచించెను. నేను బ్రకటించిన బ్రబంధ రత్నావళిలోఁ గూడ నీతని హరిశ్చంద్ర కథలో నుండి పద్యము లుదాహృతము లయ్యెను.

## మారన

మార్కండేయ పురాణములోనివిగాఁ ఇక్కడ దొరకిన పద్యము మార్కండేయ పురాణమునఁ గానరాదు. ప్రబంధ రత్నావళిలో నిది, కేతన

పద్యముగాఁ జెప్పఁబడినది. కేతన కృతులలోను గానరాదు. కాని దానిఁ బోలినది గలదు.

## కూర్మ పురాణము

రాజలింగకవి కూర్మపురాణము గలదు. ఇందు దొరకినపద్య మందు గానరాదు. ఈ కూర్మపురాణ మింకొకటి గాఁబోలును.

## యడవల్లి తుర్కరాజు[2]

ఈతనిఁ గూర్చి యేమియు నాకెరుకపడలేదు. ఈతని పద్యము సంస్కృత కవి స్తుతియే. అందు నాల్గవ చరణమున గ్రంథపాతము (సౌర) అని పూరింపఁ దగియుండును. ఆ సంస్కృత కవులలోఁ గొమ్మయ తిక్కయ పేరు గూడ నున్నది. అతఁడు సంస్కృతమునఁ గూడ గ్రంథముల రచియించి యుండ వచ్చును. అట్లగుటకీ పద్యమే కాక మఱి మూడు సాధనము లున్నవి.

I. తిక్కన భారతోపోద్ఘాతమున—

శ్లో. కిమస్థి మాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసేత్వమ్।
కిం కాలకూటం కిమువా యశోదా
స్తన్యం తవ స్వాదు వద ప్రభోమే॥

అని శ్లోకము జేర్చుట:

II. కేతన దశకుమార చరిత్రలో—

క. అభినుతుఁడు మనుమ భూవిభు
సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా
నుభయ కవిమిత్ర నామము
త్రిభువనముల నెగడ మంత్రి తిక్కఁడు దాల్చెన్.

అని ప్రస్తుతించుట;

III. మధురా విజయమను (కంపనాభ్యుదయ మని దీనికే నామాంతరము) కావ్యమును రచియించిన గంగాంబ ( ఈమె యాంధ్ర స్త్రీ ) తెలుఁగు దేశపు సంస్కృత కవులను స్తుతించుచు-

తిక్కయన్య (జ్వ) కవే స్సూక్తిః కౌముదీవ కలానిధేః ।
సత్పక్షైః కవిభిస్స్వైరం చకోరై రివ సేవ్యతే॥
చతుస్స ప్తతి కావ్యోక్త వ్యక్తి వైదుష్య సంపదే ।
అగస్త్యాయ జగత్యస్మిన్ స్పృహయే త్కోనకోవిదః ॥

ఇత్యాదిగాఁ జెప్పినది. ఇందు తొలి శ్లోకమునఁ బేర్కొనఁబడినవాఁడు కవిఁబ్రహ్మయగు మన తిక్కన సోమయాజియే యని నా నిశ్చయము. తర్వాతి శ్లోకములలోని యగస్త్య కవియు, తిక్కనామాత్యుఁడును సమకాలము వారే. అగస్త్యుఁడు కాకతీయ ప్రతాపరుద్రుని యాస్థాన కవి.* గంగాంబకా యగస్త్యుఁడు గురువో, గురువు గురువో యగును. గంగాంబ తిక్కన సోమయాజిని దర్శించియు నుండవచ్చును. తిక్కన సోమయాజి సంస్కృత గ్రంథములను రచింపకున్నచో నామె యట్లు సంస్కృత కవి స్తుతిలో నాయనను స్తుతింపదు.

## విక్రమ సేనము

ఈ గ్రంథమును జిమ్మపూఁడి యమరేశ్వర కవి రచియించెను. ప్రబంధ రత్నావళిలో నీ గ్రంథమున నుండి పెక్కు పద్యము లుద్ధరింపఁబడినవి.

## విజయ సేనము

ఇది తిక్కన సోమయాజి రచియించినది. లక్షణగ్రంథములలోఁ గొన్ని పద్యము లుదాహరింపఁబడినవి.

లక్షణ గ్రంథములం దుదాహృతములయిన పద్యములను బట్టి తెలియ వచ్చు గ్రంథములను తత్కర్తలను వేఱొక వ్యాసమునఁ బేర్కొందును.

* డెబ్బదినాల్గు మహాకావ్యముల రచియించిన మహాకవి 'బాలభారత' మను పేర రచించిన యిర్వది సర్గల మహాకావ్యమును నేనిప్పుడు నాగరాక్షరము లతో ముద్రించుచున్నాడను.[3]

## వివరణ కర్త అధోజ్ఞాపికలు

1. శ్రీ నడకుదుటి వీరరాజు పంతులుగారి "సర్వలక్షణ సారసంగ్రహము" (భారతి, ఆగస్టు, 1927, పుటలు 9-17) అను వ్యాసముపై అభిప్రాయ భేద ప్రకటనార్థము వేటూరివారు "వినోద విమర్శము" అను శీర్షికతో (భారతి, నవంబరు, 1927, పుటలు 41-45) ప్రకటించిన వ్యాసమునకు ప్రస్తుత వ్యాసము అనుబంధము. ఇది "సుభాషి" అను సాహిత్య మాసపత్రిక, సంపుటం - 1, సంచిక-4, డిశంబరు, 1927, పుటలు 200-208 నుండి గ్రహింపబడినది. పత్రికా సంపాదకుడు - పందిరి మల్లికార్జునరావు (ఈయనే తర్వాత 'కిన్నెర' పత్రికను స్థాపించినాడు) ప్రకాశకుడు - అరవ రామమూర్తి, రాజమహేంద్రవరము.

2. అస్మద్గురువులు కీ॥శే॥ తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు, భారతి, జూన్, 1962, పుట - 93 'కలగూరగంప'లో 'పెదతూర్కానకవి'ని గూర్చి వ్రాసిన దానిలో తమ గురువులైన వేటూరి వారు 'యడవల్లి తుర్కారాజు'ను గురించి వ్రాసిన విషయం ప్రస్తావించలేదు. పెదతూర్కాన, యడవల్లి తుర్కారాజు వేర్వేరు కవులు కావచ్చు. కాని తిమ్మావఝ్ఝలవారు ధూర్జటి లింగరాజకవి వ్రాసిన అముద్రిత "పెద కాళహస్తి స్థల మాహాత్మ్యము"లో పూర్వకవి స్తుతిలో-

జాగ్రద్ధూర్జటి చటుల జ
టాగ్ర నటద్ధ్యోధునీ స్వనాం చద్దుర్గా
నుగ్రహ కవిత్వ విభవ స
మగ్రుని పెదతూర్కనార్యు మతి నుతియింతున్.

అని యున్నదని, యుండలి, "పెదతూర్కానకవి యెవఁడో, యాతఁడు రచించిన గ్రంథము లేవో మనకు తెలియరాదు" అంటూ ఈ కవి యొక్క యునికిని గూర్చి "మన కవి చరిత్రకారు లెవ్వరును బేర్కొని యుండలేదు. లింగరాజ కవి తప్ప, యింకే కవియును ఆతని స్తుతించి యుండలేదు. అసలు 'తూర్కాన' యన్న పేరే వింతగా నున్నది. కాని ప్రాచీన శాసనములలో 'తూర్కాన' యను పేరు కానవచ్చుచున్నది. తూర్కాన'యను కవి జక్కన కంటె ముందు కాలములో వెలసియుండెనో లేక దగ్గుబల్లి దగ్గననే లింగరాజ కవి 'తూర్కాన' యని

పేర్కొనెనో ఇంకను పరిశోధింపవలసియున్నది. 'దుగ్గన' నామము దుర్గన పద వికృతి యగుట, యతడు శివకాంచీ మాహాత్మ్యమును రచించి యుండుట, తుర్కన యనునది 'దుర్గన' యనుటకు లేఖకులు వ్రాసిన యపరూపము కాఁదగుట యతఁడు దుర్గానుగ్రహ కవిత్వ వైభవుఁడగుట యనునవి ఈ యూహకు కారణములు కాని, దుగ్గన తన నాసికేతోపాఖ్యానము నందలి యాశ్వాసాంత గద్యలలో దన్నుగూర్చి 'శ్రీనాథ మహాకవీంద్ర ప్రసాదలబ్ధ కవితా విశేష' యని పేర్కొని యుండుట ఈ యూహమునకుఁ బ్రబల ప్రతిబంధకమగుచున్నది. దీనిని తూర్కనకవి దుగ్గన కాక మఱియొకడని, యతఁడు జక్కన కంటెఁ బూర్వకాలము నందు వెలసినవాఁడు కాఁదగునని యూహింపనగు చున్నది"

అని వ్రాసినారు. 'తూర్కన' అను పేరు వింతగా నున్నదన్న తిమ్మావఝ్ఝల వారి అభిప్రాయాన్ని శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి (శాస్త్రి మనుమడు) గారు సమన్వయ పరచి, దృష్టాంతం శ్రీనాథుని శృంగార నైషధంలోనే చూపించారు. (భారతి, ఆగస్టు 1962, పుట - 98)

"శ్రీ తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు గడచిన నెల 'భారతి'లో వ్రాసిన వ్యాసమున ఇతనిం గూర్చి ప్రశ్నించుచు, తూర్కన యనుపేరు వింతగా కూడ నున్నదనియు అట్టి కవి తిక్కనకు తర్వాతను, జక్కనకు ముందును ఉండి యుండుననియు, కాబట్టి ఈతడు దగ్గుబల్లి దుగ్గన (దుగ్గన-దూర్కన) కానేరడనియు వ్రాసియున్నారు. పెద తూర్కన మంత్రి నొకనిని శ్రీనాథుడు శృంగార నైషధమున మామిడి సింగనామాత్యుని మూలపురుషునిగా పేర్కొనియున్నాడు.

> ఆ మునినాథు నన్వయము నం దుదయించెఁ బయఃపయోనిధిన్
> యామవతీ కళత్రుఁడుదయంబయి నట్లుగ గల్పవృక్ష చిం
> తామణి కామధేను సమదాన నిరూఢుఁడు విద్వషత్తమ
> స్తోమ దివాకరుండు పెద తూర్కన మంత్రి కులాగ్ర గణ్యుఁడై.
>
> (ఆశ్వా 1–ప. 20)

పెద తూర్కన మంత్రి భారద్వాజ గోత్రుడు. తర్వాత శ్రీనాథుడు 'తత్సంతాన క్రమంబున' అని నెల్లూరి చిటిపెద్ద ప్రభుని అతని కుమారుని

మామిడన్నను- ఇట్లు క్రమమున మామిడి సింగన్న వరకు చెప్పియున్నాడు. శ్రీనాథుని కాలము నుండి వెనుకకు లెక్కపెట్టుకొందమన్న ఇన్ని తరములనుటకు సాధ్యము కాక, తూర్కన తర్వాత ఎప్పుడో చిటిపెద్ద ప్రభువనుటచే చాల పూర్వుడని మాత్రము కుదురుచున్నది. తిక్కనను తర్వాత వాడనియే యను కొన్నను మామిడి వారి నందరిని శ్రీనాథుడు వీరాగ్రేసరులనగానే వర్ణించినాడు గాని కవులనుగా గ్రంథరచయితలనుగా పేర్కొన లేదు. కావున కవి యనుటకు కుదురకున్నది.''

"తూర్కన యనుపేరు వింతగానే యున్నది గాని మనకు లేకపోలేదు. నైషధమే సాక్షి. తమిళదేశములో నేటికిని కలదు. 'తులుక్కాణం చెట్టియారులు' ఎందరో కలరు. 'తులుక్కాణం అమ్మన్' అను గ్రామదేవత కలదు. ఈ తులు క్కాణ దేవియే దుర్గయు కావచ్చును గాని అది తుర్క శబ్దం కాక తూర్క శబ్ద మగుట చేతను 'పెద తూర్కన మంత్రి', 'నెల్లూరి తూర్కరాజు' అను ప్రయో గము లుండుటచేతను విచారణీయము. మా తాతగారు సూర్యారాయాంధ్ర నిఘంటు సంపాదకులుగా నుండిన కాలమున వెలువరించిన 'నిఘంటు కతి పయము' లలో శబ్దసిద్ధి యెట్లు అను శీర్షిక క్రింద 15వ సూత్రమున నిట్లు ప్రశ్నించినారు (1914-16)- ''కొన్ని మనుష్యాది నామములకు అర్థ వ్యుత్పత్తుల నరయవలయు. ఉ॥ ఎలమంద, పల్లాలు. తూర్కన, పళ్ళయ్య.''

''మంత్రులుగా నుండిన నియోగులే ఆ కాలమున కవిత్వము చెప్పు చుండినందున ఈ పెద తూర్కన మంత్రియే ఆ పెద తూర్కన కవిగా నుండు నేమో! ఉభయులును శైవులుగానే యున్నారు. కాళహస్తి, నెల్లూరు ప్రాంతాల వారే. శ్రీనాథుని కాలమునకు మఱచిపోయి యుందురు" అని వేదం వారి వివరణ.

తిమ్మావఝ్ఝలవారు తమ దృష్టికి రాలేదని 'యడవల్లి తుర్కరాజు' ను ప్రస్తావించక పోవచ్చును. కాని వేదం వారు కూడ వేటూరువారు చెప్పిన 'తుర్క రాజు' ను తడవక పోవుట వింతగా నున్నది. తిక్కన భారతోపోద్ఘాత మందలి ''కిమస్థిమాలాం...'' అను సంస్కృత శ్లోకమును, కేతన దశకుమార చరిత్ర లోని తిక్కన ప్రశంసను చేసిన కంద పద్యాన్ని ఉదాహరించిన యడవల్లి తుర్కరాజు ''నన్నపార్యుని వచః ప్రాగల్భ్య నిర్వాహము" ను ప్రశంసించినట్లు వేటూరి వారు ఉదాహరించియున్నారు. దుర్గ శబ్దమే తుర్క, దుర్గగా మారిన

దైనను 'తూర్కన' ను గూర్చిన ప్రశంస వచ్చినప్పుడు 'తుర్క' అనే పేరుతో ఒక ప్రాచీన కవి యున్నాడని విస్మరించుట శోచనీయమే.*

పెద తూర్కన్న మంత్రి యింటిపేరు 'మామిడి' కాగా 'తుర్కరాజు' యింటి పేరు యడవల్లి. కాబట్టి విస్పష్టముగా వేర్వేరు వ్యక్తులే. కాని సమ కాలీను లగుదురేమో పరిశీలింపవలసి యున్నది. 'పెద తూర్కన మంత్రి' కే **'నెల్లూరి తూర్కరాజు'** అని కూడ పేరున్నదని వేదం వారు చెబుతున్నారు. నెల్లూరు నివాసి యైనందువలన నెల్లూరు తూర్కరాజు అయనాడు గాని యింటి పేరు 'మామిడి' వారు. ఈ 'తూర్కరాజు' 'యడవల్లి తుర్కరాజు'కు దగ్గరి వాడేమో చరిత్ర పరిశోధకులు నిర్ణయింపవలసియున్నది. వేటూరి వారు కూడా తమ వ్యాసంలో 'యడవల్లి తుర్కరాజు'ను గూర్చి వ్రాస్తూ ''ఈతనిఁ గూర్చి యేమియు నా కెఱుక పడలేదు" అని వ్రాసినారు. కాబట్టి ఈ హ్రస్వదీర్ఘాక్షర నామ సహితులైన 'తూ(తు)ర్కరాజు'ల ఔగాములు పరిశోధకులు పరిశీలింప వలయునని మనవి.

పైగా, **'పెద తూర్కన మంత్రి'** అనడం మూలాన 'చిన తూర్కన' అనే వాడొకడున్నాడని తెలియవస్తోంది. ఆ 'చిన తూర్కన' ఎవరో? సమ కాలికు లవడం చేత ఒకవేళ మన 'యడవల్లి తుర్కరాజు'నే చిన తూర్కనగా పరిగణించి విస్పష్టత కోసం 'తూర్కన మంత్రి' పేరు ముందు 'పెద' అనే విశేష వాచకం చేర్చారేమో ! 'నెల్లూరి తూర్కరాజు' అనే పేరు కూడా ఈ విస్పష్టత కోసమే ఏర్పడివుండవచ్చు. ఈ ఊహలోని నిజా నిజాలు కూడా చరిత్ర పరిశోధకులు అన్వేషించగలరు.

3. కాకతీయ ప్రతాపరుద్రుని యాస్థాన కవియైన అగస్త్యుడు రచించిన యిర్వదిసర్గల 'బాల భారతము'ను నాగరాక్షరములతో వేటూరి వారు ముద్రించు చున్నట్లుగా 'అధసూచిక'లో తెలిపిరి. దీనిని నేను చూడలేదు.

* [కరీంనగర శాసనములో 'వితతయశుడైన యతనికి బతివ్రతాగుణ విభాసి భాగ్యవతి మహా-సతియైన తురుకమాంబకు'అని కలదు. ఆ పట్టున వేటూరివారు మార్జినల్ నోట్సులో ''తుర్కమాంబ - ? శ్రీనాథుడు - తుర్కనమంత్రి? ఈ పేళ్లు తురకలద్వారా వచ్చినవేనా?''అని పృచ్ఛించి నారు - సం॥]



# కాలకంఠ శతకము

[వేటూరి జోగయార్య పుత్ర సుందరకృత కాలకంఠ సీస పద్యావళీ]

సీ. శ్రీ పార్వతీలోల సేవితామర జాల
  ఫణిదామ ఫాలాక్ష పరమపురుష
కనకాద్రి కార్ముక గజకర్బురాంతక
  కైలాసనాయక కాలకాల
నారదమునివంద్య శారదాభ్ర శరీర
  కరపుట కమలజ వరకరోట
రవి శశి శిఖి నేత్ర రమణీయ సుచరిత్ర
  సకలలోక పవిత్ర శక్ర మిత్ర

అవని వేటూరి క్షీరాబ్ధి కబ్జుఁడనగఁ
బరగు జోగయ సూను సుందరుని బ్రోచి
కవిత వాక్ప్రౌఢి నొసగవే కరుణ మెరయ
కదళిపురివాస ! గౌరీశ ! కాలకంఠ !

సీ. శ్రీ కాలకంఠాఖ్య సీస పద్యావళి
  జెప్పఁ బూనితి నిదే చిత్తగింపు
లక్షణ గ్రంథముల్ వీక్షింపఁగాలేదు
  శబ్దశాసను ఫక్కి జదువలేదు
కావ్యపంచకమైన గనులఁ జూడఁగలేదు
  కల్పనాశక్తియు ఘనము కాదు
నీ యనుగ్రహమునే నెరనమ్మితిని గాని
  భాషాధికారంబు పడసి గాదు

నిత్యముగ భూమిపై మేను నిల్వదనుచు
జంకి యీ తీరు దలఁచితి శంకలుడిగి
తప్పులన్నియు సైరించ దండమిడుదు
కదళిపురివాస ! గౌరీశ ! కాలకంఠ !

సీ. భూషణమ్ములకుఁగా భూషించఁగా లేదు
భూము లిమ్మని నిన్ను బొగడలేదు
హయములకొరకు నిన్నాసించగాలేదు
గజము లిమ్మని నిన్ను గలియలేదు
వస్త్రంబు లడుగగా వద్ద జేరనులేదు
భోగ లిమ్మని నిన్ను బోరలేదు
కానుక లిమ్మంచు కయ్యమాడఁగ లేదు
గోధనం బిమ్మని కొసరలేదు
పాప సంఘాతమును మాన్పి భయము బాపి
మోక్ష మిమ్మని గోరితి రాక్షసారి!
నీదు కృపనెంతొ నమ్మితి నిత్యమనుచు
కదళిపురివాస! గౌరీశ! కాలకంఠ!

(సశేషము)

[శ్రీ ప్రభాకరుల పితృపాదులగు వేటూరి సుందరశాస్త్రిగారి అముద్రిత కృతుల నుండి గ్రహించినవి — సం॥]



నాచన సోమనాథుని

# ఉత్తర హరివంశము

సవ్యాఖ్యానము

[వెనుకటి సంచిక తరువాయి]

—వేటూరి ప్రభాకరశాస్త్రి

[మేము ప్రకటించుచున్న మాదిరి బాగానే ఉన్నదనీ, అయితే మణిమంజరి పత్రికలో భాగాలుగా కాక ఒక్కపరి చదువుకొనే అవకాశం కలిగేటట్లు గ్రంథమంతా వెంటనే ముద్రించవలెననీ మిత్రులు కొందరు వ్రాసిరి. పరిచయము కొరకేగాని గ్రంథమంతా పత్రికలో ప్రకటించే ఉద్దేశం మాకూ లేదు. గ్రంథాన్ని వెంటనే ప్రకటించవలెననియే మాసంకల్పము. అయితే ముద్రణ ఖర్చు ముప్పదివేలకు పైబడునని ప్రెస్సువారి అంచనా. ఉదారులు తోడుపడి ప్రెస్సు, పేపరు ఖర్చులకు ఆర్థిక సహాయమో, అప్పో ఇవ్వగల్గినా వారిని స్మరించి ఈ గ్రంథాన్ని వెంటనే అచ్చుకివ్వడానికి వీలు కల్గుతుందని ట్రస్టువారి తలంపు. వారి యీ అభ్యర్థనను సహృదయులు మన్నిస్తారనే ఆశిస్తాము. —సం॥]

సీ. కౌరవాధీశ్వరు కన్యకారత్నంబుఁ
గామించి సాంబుండు గజపురంబు
నొచ్చి ప్రముచ్చిమిఁ జేయఁ జూచిన నెఱిఁగి యా
రారాజువానిఁ గారాగృహమున
నిగ్రహీతు[1]నిం జేయ నెఱిసిన వార్తవే(గ్రహీతుఁజేసిన నెఱనెనవార్త)[1]
గమవిని నగరంబు గంగలోనఁ
ద్రవ్వివై చెదనని తన భూరి హలమున
[2]నెత్తి యెత్తూపి యయ్యేటి నీరు (నెత్తియెత్తేఁపె; నెత్తిపఱపిన)[2]

పఱపెఁబట్టణ మిట్టట్టు పడఁ గదల్చి
కొడుకుఁ గోడలిరావించి కోట వెలికి
వియ్యమని శిష్యుఁడని కాచి విడిచె నతని
సీరపాణితో రాజులు చెనయువారె ? 9

*వ్యా. ఏతత్పద్యమునసే కథార్థమెల్ల సంగృహీతమయినది. మూలమున వివృతికూడ నున్నది. గజపురము = హస్తినాపట్టణము; ముచ్చిమి = ముచ్చుదనము (దొంగతనము), నెఱసిన వార్త = వ్యాపించిన మాట వరుస; 'ఎత్తి యెత్తూఁచి' అనుటలో ఎత్తి + ఎత్తి + ఊఁచి అని కాని ఎత్తు + ఊఁచి, అని కాని ఛేదము చేసికొనవచ్చును. 'చెప్పంవు' ప్రభృతుల వంటి దిది. ఇట్టి చోట్ల క్త్వార్థక సంధి మహాకవి సమ్మతమనికాని, అట్లుగాక యిది శబ్ద పల్లవమే యనికాని సమర్థనము. ఎత్తి యెత్తేచి అని వ్రాఁత ప్రతులలోను, నెత్తిపఱచిన అని కం. వి. ముద్రణమునను నుండఁగా వ్రాత ప్రతుల పాఠమును 'ఎత్తి యెత్తూఁచి' అని నేను గుర్తించి మార్చినాఁడను.*

[సాంబుండు, కౌరవ అధీశ్వరుఁడు = దుర్యోధనుని యొక్క, కన్యకా రత్నంబున్ = పుత్త్రికారత్నమును, కామించి = ప్రేమించి, గజపురంబు = హస్తినాపురమును, చొచ్చి = ప్రవేశించి, ముచ్చిమి = దొంగతనము, చేయన్ చూచినన్ = చేయుటకుఁ బ్రయత్నింపఁగా, ఎఱిఁగి = తెలిసికొని, ఆ రారాజు = ఆ దుర్యోధనుఁడు, వానిన్ = సాంబుని, కారాగృహమునన్ = చెఱసాలయందు, నిగృహీతునిన్ = బంధింపఁబడినవానినిగా, చేయన్ = చేయఁగా, నెఱసిన వార్త = వ్యాపించినవార్తను, వేగమున = మిక్కిలి శీఘ్రముగా, విని, నగరంబు = హస్తినాపురమును, గంగలోనన్ = గంగానదిలోనికి, త్రవ్వివైచెదన్, అని, తన భూరిహలమునన్ = తన గొప్పనాఁగటితో, ఎత్తి ఎత్తి ఊఁచి = ఎత్తి యెత్తి యూచి, పట్టణము = హస్తినాపురము, ఇట్టు అట్టు పడన్ = ఇటు నటు పడునట్లుగా, కదల్చి, ఆ యేటి నీరున్ = ఆ గంగానదీజలమును, పఱపెన్ = ప్రవహింపఁజేసెను, కోట వెలికిన్ = కోట వెలుపలికి, కొడుకున్ = తన కుమారుఁడగు సాంబుని, కోడలిన్ = కోడలిని (సాంబుని భార్యను), రావించి = వచ్చునట్లుచేసి, అతనిన్ = దుర్యోధనుని, వియ్యము అని = సంబంధి

యనియు, శిష్యుఁడు అని = శిష్యుఁడనియు, కాచి = రక్షించి, విడిచెన్ = విడిచి పెట్టెను, సీరపాణితోన్ = బలరామునితో (నాఁగటిని జేతియందు గలవాఁడు), రాజులు = ఇతర రాజులు, చెనయువారె = ఎదుర్కొనఁగలరా ?

తాత్పర్యము : సాంబుఁడు దుర్యోధనుని కుమార్తెను ప్రేమించి యామె నపహరించి తెచ్చుటకై హస్తినాపురమును ప్రవేశించెను. అది యెఱిఁగి దుర్యోధనుఁ డాతని బంధించి చెఱసాలయందుంచెను. ఈ వార్త తెలిసి బలరాముఁడు కుపితుఁడై హస్తినాపురము నెల్ల గంగానదిలోనికిఁ ద్రవ్వివైచెదనని పలికి తన నాఁగటిచే నా నగరమును గంగానదీ జలముల యందు ముంచి ముంచి యెత్తెను. అప్పుడానగర మంతయు నిటునటు కదలిపోయెను. పిదప నతఁడు తన కొడుకును, గోడలిని గోట వెలుపలికి రావించి, తనకు వియ్యమనియు, శిష్యుఁడనియు దుర్యోధనుని క్షమించి విడిచెను. రారాజయిన దుర్యోధనుఁడే యిట్లు కాఁగా నితర రాజు లాతని నెదుర్కొనఁ జాలుదురా? చాలరని భావము.

విశే॥ చతుర్థ పాదమున 'ఎత్తి పఱపిన నయ్యేటి నీరు' అనియు 'ఎత్తి యెత్తేపి యయ్యేటినీరు' అనియుఁ బాఠములు కలవు. 'ఎత్తి పఱపిన' యనునది వీరేశలింగ కవి ముద్రణమునఁ గలదు. వ్రాఁత ప్రతులందెల్ల 'ఎత్తియెత్తేఁపి' యనియే కలదు. 'ఎత్తియెత్తూఁపి'యని సందర్భానుసారముగా నిట సవరింపఁబడినది. 'ఎత్తియెత్తూఁపి' యగుచో క్త్వార్థకేకార సంధి మహాకవి సమ్మతమని కాని, శబ్దపల్లవమని కాని సమర్థించుకొనఁదగును.

మూలమునఁ గథావివృతి కలదు. ఇట నా కథ యెల్ల సంగ్రహింపఁబడినది.]

గీ. ఆతఁడు నాఁగట నెత్తిన యంత నుండి
యేటి [1]దిక్కంతకంతకు నెగసియుండు (దిక్కున కంతయు)
హస్తినాపురి యది యేల యమున నాఁటఁ
గోలె మధురాపురముఁ జుట్టుకొంచుఁ బాఱు. 10

*వ్యా. బలరాముఁడు హస్తినాపుర ప్రాకారవప్రము పైతట్టున నాఁగటిపోట్లు పొడిచి, హస్తినాపురియెల్ల గంగానదిలోఁ గలయునట్లు ఎత్తి*

యెత్తి యూఁపఁ దొడఁగెను. అట్లు ఎత్తి యూఁపుటచే హస్తినాపురి గంగ దరి నుండి పురియావలి ప్రాకారాంతము దాఁకఁ బోనుబోను ఎగసి (యెత్తెక్కువై) యుండును. గంగ తీరిట్లున్నది. ఇఁక యమున, (8 పద్యము గీతి చూ.) సీరముఖమునఁ జీల్చి తెచ్చినదాదిగా మధురాపురమున కగడ్తయై చుట్టి పాఱుచున్నది. (నేఁడు కూడఁ జూచిన గంగాయమునల పాఱుదల హస్తినాపుర-ఢిల్లీ-ప్రాంతమున నిట్లే యుండునట).

[ అతఁడు = బలరాముఁడు, నాఁగటిన్ = తన నాఁగటిచే, ఎత్తిన యంత నుండి = ఎత్తినప్పటి నుండియు, ఏటిదిక్కు = గంగానది దిక్కునుండి, అంత కంతకున్ = మీఁది మీఁదికి, హస్తినాపురి = హస్తినాపురము, ఎగసి ఉండున్ = ఎత్తయి యుండును, అదియేల? = గంగమాట యేల? యమున = యమునా నది, నాఁటఁగోలెన్ = నాఁటి నుండి, మధురాపురమున్ = మధురానగరమును, చుట్టికొంచున్ = చుట్టుకొనుచు, పాఱున్ = ప్రవహించున్.

తా॥ బలరాముఁడు తన నాఁగటితో నెత్తి నప్పటినుండియు, హస్తినాపురము గంగానది గట్టునుండి యంతకంత కెత్తుగా నెగసియుండునట్లు కానవచ్చును. దీని మాటయేమి? యమునా నదియు నాతఁడు సీరముఖమునఁ జీఱి తెచ్చిన దాదిగా మధురాపురమున కగడ్తయై దానిఁ జుట్టి పాఱుచున్నది.

విశే॥ బలరాముఁడు హస్తినాపురము యొక్క ప్రాకారవప్రము పైతట్టున దన నాఁగటితోఁ బొడిచి నగరము నెత్తియెత్తి గంగానదిలో ముంచఁదొడఁగెను. అందుచేతనే గంగదరి నుండి పురియావలి ప్రాకారముదాఁకఁ బోనుపోను నెత్తెక్కువై యుండును. గంగదరిని పల్లముగాను, బోనుపోను ఎత్తుగాను హస్తినాపురముండుట యిట్లు భావింపఁబడినది. నేఁడు కూడ దాని యునికి యట్లే యుండునఁట! ]

క. హలపాణిమహిమ చెప్పం
గలవారెవ్వరు? పురాణ కథలన్ మఱియున్
దెలిసికొనుము, నేఁజెప్పక
నిలిచిన చోటులు వివేక నిర్మలబుద్ధిన్. 11

వ్యా॥ అతి సంగ్రహముగా నేనిక్కడ బలరాముని మాహాత్మ్యమును జెప్పితిని. ఇందు విడువఁబడిన పట్టులు హరివంశ భాగవత భారతాది పురాణములందు విపులముగాఁ దెలిసికొనవచ్చును - అని వైశంపాయనుఁడనఁగా-

[హలపాణిమహిమ = బలరాముని యొక్క మాహాత్మ్యమును, చెప్పన్ కలవారు = చెప్పఁగలవారు, ఎవ్వరు, పురాణకథలన్ = హరివంశ భాగవత భారతాది పురాణములయందు, నేన్ = నేను, చెప్పక, నిలిచిన చోటులు = నిలిచి పోయిన పట్టులు, వివేక...బద్ధిన్-వివేక = యుక్తాయుక్త పరిజ్ఞానము చేత, నిర్మల = పరిశుభ్రమయిన, బుద్ధిన్ = బుద్ధితో, తెలిసికొనుము.

తా॥ బలరాముని మహిమ నెవరు చెప్పఁగలరు? నేను జెప్పక మిగిలిన పట్టులను బురాణకథలందుఁ జదివి తెలిసికొనుము. ]

క. అనుటయు నా జనమేజయ
జనపతి యిట్లనియె రుక్మి సచ్చిన మగుడన్
జని యాదవ నగరంబున
జనార్దనుండేమి సేసె సౌజన్యనిధీ। 12

[ అనుటయున్ = అని వైశంపాయనముని పలుకఁగా, ఆ జనమేజయ జనపతి = ఆ జనమేజయ మహారాజు, ఇట్లు = ఈ విధమున, అనియెన్ = పలికెను, సౌజన్యనిధీ = మంచితనమునకు నెలవయినవాఁడా! రుక్మి, చచ్చినన్ = చావఁగా, జనార్దనుండు = శ్రీకృష్ణుఁడు, మగుడన్ = మరల, చని = పోయి, యాదవనగరంబునన్ = యాదవులదగు ద్వారకానగరమున, ఏమి, చేసెన్?

తా॥ వైశంపాయనునికి జనమేజయుఁ డిట్లనెను. "మహాత్మా! రుక్మివధానంతరము శ్రీకృష్ణుఁడు మరలిపోయి యాదవ నగరమున నేమి చేసెను?" ]

వ. అనుటయు వైశంపాయనుం డిట్లనియె. 12
[అనుటయున్ = అని పలుకఁగా]

[సశేషము]



# యోగ విషయము : ఉపన్యాసము

— వేటూరి ప్రభాకరశాస్త్రి

[6-8-1947 నాటి ఉపన్యాసమునకు తరువాయి భాగమిది. ప్రార్థనానంతరము శాస్త్రిగారు ప్రసంగించిన విషయమును వ్రాసి పంపినవారు సోదరులు సింగరాజు సచ్చిదానందం గారు. నాటి యీ ప్రసంగ పాఠమును భద్రపరచికొని మాకందించిన వారు యోగమిత్రులు శ్రీ కొత్త వేంకటేశ్వరరావుగారు. వారికి మా కృతజ్ఞతలు. —సం॥]

మనకు రాజకీయ స్వాతంత్ర్యము కావలెనన్న కోర్కె ప్రారంభమైనది. 1857 నాడు. అంటే యిప్పటికి 90 సంవత్సరముల నాటిమాట. అప్పటి స్వాతంత్ర్య పోరాటములో నెందరో అణగారి పోయినారు. కాంగ్రెసు పుట్టి యిప్పటికి 61 సంవత్సరములు. రాజకీయ స్వాతంత్ర్యమునకై కాంగ్రెసెన్నో పోరాటములను కావించినది. అనేకులు గతించినారు. అనేకుల జీవితములను త్యాగము చేసినందువల్లనే రాజకీయ స్వాతంత్ర్యము నందుచున్నాము. అదివరకు మనలను పాలించుచున్న బ్రిటిషు గవర్నమెంటువారు వారి శాసనములకు బద్ధులు కాలేదని ఈ దేశములోని రాజకీయ నాయకులనెందరనో చెరసాలల్లో క్రుక్కితే యిక మళ్ళీ మాట్లాడరని చెరసాలల్లో క్రుక్కినారు. లాఠీ ఛార్జీలు చేసినారు. తుపాకి కాల్పులు కాల్చినారు. చచ్చినవారు చావగా కొంత మంది యీ డక్కామక్కీలకు తాళుకొని స్వాతంత్ర్యమును దేశమునకు సిద్ధింపజేసినారు. లజపతి రాయ్, మోతీలాల్ దంపతులు మొదలగు వారా విధములగు కష్టములకు లోనై దేశము కొరకు ప్రాణములను త్యాగము చేసినారు. గంధి నెహూౄలవంటి వాళ్లు గెల్చుకొని వచ్చారు.

స్వాతంత్ర్యమునకై పోరాటములను జరిపే మొదటి దినాలలో మనవాళ్లే కొందరు బ్రిటిషు వారిని సపోర్టు చేస్తూ ఇక్కడి రాజకీయ నాయకుల నెన్నో బాధలు పెడ్తూ వీళ్ల స్వాతంత్ర్యమును సాధిస్తారట అని హేళన చేస్తూ ఉండినారు. కాని తుదకు యిక్కడి జనులలోని స్వాతంత్ర్యేచ్ఛను అరికట్టడానికి తరము కాకపోగా వీరి ప్రెషరుకు తట్టుకోలేమని గుర్తించి బ్రిటిషువాండ్లు దేశ పరిపాలనమును మన కప్పగించి తప్పుకొంటున్నారు.

నవ గ్రహములు, ట్రిపల్ శక్తులకు లోబడి మన మండవలసినట్లుగా యిప్పటివరకు కాస్మిక్ శాస్త్రములున్నవి. కాని మానవుడు పుట్టిన నాటి నుండి మన మెక్కడ పుట్టినాము ఎక్కడికి వెళ్తున్నాము ఏమీ తెలియలేదే అనీ మనము

Independent గా నిల్వడమునకు మార్గమేదయినా ఉందా అని తంటాలు పడుతూ ఉండేవాడు. ఈ విధముగా తంటాలుపడగా తుదకు ఇండిపెండెంటుగా నిల్వడమునకు మార్గమును చూపునదిగా యీ యోగమార్గము స్టార్టయినది. ఇదివర్కవుటయ్యే కాలము వచ్చేటప్పటికి యిప్పుడు బ్రిటిషువా రిక్కడనుండి తప్పుకొనేటప్పుడు యిక్కడి విచ్ఛిన్న శక్తులు విజృంభించుచున్నట్లుగానే నవ గ్రహములూ త్రిపులు శక్తులూ విజృంభించసాగినవి. రాజకీయ పోరాటము నందు ఎందరినో బ్రిటిషు వాళ్లు మొట్టికాయల్తో మట్టు పెట్టినట్లుగానే యీ గ్రహశక్తులు కూడా వాటి కార్యమునకు అడ్డువచ్చుచున్నారని యిందులోని వాండ్లననేకులను హతమార్చినవి. కాని యిందులోనుండి కూడా జహ్వారు, గంధి వంటి వాండ్లెవరో ముఖ్యులు కొందరు నిలబడి ఇండిపెండెన్సును సాధించి తీరుతారు. ఈ లైను ప్రకారము **ఇండిపెండెన్సు అంటే తన్నుతాను రియ లైసు చేయడము తన యిన్నరును తాను చూడగలిగి సెంటర్ను టచ్ చేసిన వాడే** ఇండిపెండెంటు మేన్.

ఈనాడే బ్రిటిషు గవర్నమెంటు అధికారాన్ని అప్పగిస్తూన్నా సరిగా అన్ని వ్యవహారములనూ నెహ్రూ చక్కదిద్దుకొనేటప్పటికి కొంతకాలం పడుతుంది. స్వాతంత్ర్యమనేది మనకు వచ్చినట్లు గుర్తేమిటంటే దేశంలోని ప్రతి ఒకడి వాంట్సు తీరేట్లు కావడమే. కూటికి గుడ్డకు కరువులేకుండా పోవడమే. ఇన్నాళ్లు నెహ్రూను ఎవరైనా వెళ్ళి మా వాంట్సి వంటే చేయలేకుండా ఉండినాడు. ఇక ముందు చేయగలడు. అంటే కారణము పవర్ యితనిచేతుల్లోకి వచ్చిందన్న మాట.

ఇన్నాళ్లూ మనము ఇండిపెండెంటుగా Stand కావడానికి వీలులేకుండా త్రిపులు శక్తులు చేస్తూ ఉన్నవి. ఇక్కడి ప్రజలప్రెషర్‌కు తాళలేక బ్రిటిషువాళ్లు వెళ్లతూండేటట్లుగానే **ఎటర్నటీ కోసము ప్రయత్నము చేస్తూన్న వాళ్ళ ప్రెషరుకు తాళలేక త్రిపులు శక్తులూ మనకు లొంగి త్రిశక్తులకు తర్వాతి దగు అనంత శక్తిని మనము చూడగలిగేటట్లు మన మార్గమున కడ్డు రాకుండా తప్పుకుంటాయి.** అప్పుడుగాని మనము మనకనుగుణమగు శాసన ములను చేసుకొనుటకు సాధ్యం కాదు. **ఒకడు Stand అయితే అందరినీ** Stand అయ్యేలాగున చేయగల్గుతాడు. **ఆ స్థితి** Fourth డైమెన్షను వర్కు. వర్కవుటయితే లోకానికంతకూ వస్తుంది.



4)

# ప్రాణేశ్వరుడు

ఆనందింపుము నాథా
ఆనందించెద నాథా
ఆనందం బన్యోన్యం
బానందం బానందము.

గాఢాలింగనమున నను
గలపికొనవె నీలోపల
కడు వేడుక నీలోనే
గరఁగెద నో ప్రాణేశ్వర !

ప్రాణేశ్వరుడవు నీవే,
పరమపురుషుఁడవు నీవె
నీ పురుషత్వము నాయెడ
నెఱపగదే జగదీశ్వర !
నీలో నైక్యం బందుట
నేనును బురుషుఁడ నగుదును.

వే. ప్రభాకర శాస్త్రి

[రచనా కాలం 1932 సం॥]





# గురుధ్యానమ్

—అప్పల నృసింహశర్మ

శ్రీవిద్యా మంత్రవేద్యాయ సాక్షీపురుషవేషిణే।
సహస్రప్రియశిష్యాయ సర్వమైత్రీ విధాయినే॥
పరమామృత సంధాత్రే పరమైశ్వర్యదాయినే।
వెంకాసామి మహానామ్నే వేంకాంబాపతయే నమః॥
నమః శ్రీగురునాథాయ శ్రీమదానందమూర్తయే।
ప్రణేత్రే భృక్తయోగస్య త్రిణేత్రాజాచ్యుతాదయే॥

* * *

ధీరలక్షణ ముదార విగ్రహమ్
స్మేరసుందర విచక్షణాక్షికమ్
స్వర్ణవర్ణ విలసత్తనుద్యుతిమ్
కర్ణపేయ వరచిత్రవాగ్యుతిమ్॥
మోష సద్మఘట సంజ్ఞితాంపురీమ్
మోక్ష ధామ రచయంత ముద్యతమ్
మర్త్యజాత మజరామరం తథా
మధ్యమేవ జగతా మిమాం ధరామ్॥
వ్యక్తపూర్ణ కరుణావతారితమ్
భక్తచిత్త నిలయం సనాతనమ్
నిక్త సర్వదురితావలోకితమ్
భృక్తయోగవరదమ్ భజే గురుమ్॥

* * *

ఆనందనాథ మమ చేతసి దీప్యమానో
యాం యాం స్తుతిం వితనుషే మమ ముక్తిహేతోః
తాం తాం శిశోరివ సుముగ్ధ వచః ప్రలాపమ్
స్వీకర్తుమర్హసి దయావిలసన్ముఖశ్రీః

స్వాంతర్నివేశిత గురూత్తమ దివ్యపాద
ధ్యానోత్థితాని శతపద్య మితాన్యమూని
ఛాంతు ప్రభాకర బుధేన చ సంస్కృతాని
స్తోత్రాణి నిత్యమమితాభ సమాదృతాని॥

## శ్రీ వేటూరి ప్రభాకరసూరి విరచితం
## ఆశీర్వచన పద్యమ్

10-2-1924

*సీవీవి గురునాథ దివ్యకరుణాశీర్వాద మోద స్ఫుర*
*ద్భావేనాప్పల నారసింహ విదుషా భక్తైక తానాత్మనా*
*హృద్యం పద్యశతం కృతం ప్రతిహితం ప్రేమ్ణావధార్య ప్రభుః*
*సోయం సన్నిద ధాతు పాతు ధరణీమాద్యంతమూర్తి ర్గురుః॥*

ఏతద్గ్రంథ సంస్కర్తుః ప్రబుద్ధ సుధియో మహాపండితవరస్య వేటూరి ప్రభాకరశాస్త్రి నామధేయస్య సన్మిత్రమణేః ఆశీర్వచన పద్యమ్.

*భక్త్యా తదేక పరయా బహూభావక్లుప్త*
*సూక్త్యాకృతో గురుజయ స్సుమహాప్రభావః*
*జీయాచ్చిరాయ నరసింహ మునేః ప్రబంధః*
*సీవీవి దేవ వరసిద్ధ గుణప్రకర్షః.*

శ్రీగురు చరణమ్ శరణమ్.

15-8-1924

[శ్రీ అప్పల నృసింహకవి కృత సీవీవీగురునాథ విజయాఖ్య కావ్యము నుండి గైకొనిన స్తుతి పద్యములును, అందే వా రుదాహరించిన వేటూరి ప్రభాకర శాస్త్రిగారి ఆశీర్వచన పద్యములును. —సం]



# ప్రజ్ఞాప్రభాకరము

—కొత్త రామకోటయ్య.

(గత సంచిక తరువాయి)

7 వ తేదీ ఫిబ్రవరి నెల 1978 వ సంవత్సరము పుష్యమాసము. అమావాస్య, శ్రవణము, మంగళవారము ఉదయము ప్రార్థన పూర్తి అయిన తరువాత గురువుగారిని గురించి నేను మాట్లాడితిని. గురువుగారు తరచుగా శిష్యులకు బోధించే మంచిమాట ఇది. ''మీరందరూ చెడును తొలగించండి, మంచిని పెంచి అందరికీ పంచిపెట్టండి'' అని చెప్పేవారు.

1. చెప్పుటయే కాక వారు స్వయముగా దీనిని అక్షరాలా ఆచరించేవారు.

2. వారికి ప్రత్యక్షానుభవముగా తెలిసిన విషయములను గురించి మాత్రమే వారు మాట్లాడేవారు.

3. వారు ఆచరించి చూచి, పరిశీలించిన తరువాత నచ్చినపుడు మాత్రమే ఇతరులకు బోధించేవారు. అంతియేకాని ఇతర శాస్త్ర గ్రంథముల నుండి కాని, మహర్షుల బోధల నుండి కాని, ఉదాహరించి చెప్పుట వారి కలవాటు లేదు. చెడును తొలగించుట మంచిని పెంచుట అన్నది వారెక్కడ వున్న అక్కడ నడిచే యోగక్రియ. దీనిని ''దుష్ట సంహారము'' ''శిష్ట సంరక్షణము'' అని పిలుచుట యున్నూ కలదు. అది ఎట్లో పరిశీలించి చూతము. దుష్ట సంహారము అనగా చెడ్డవారైన రాక్షసుల తలలను నరికి వేయుట అనిన్నీ శిష్ట సంరక్షణము అనగా దేవతలను ఆపదలనుండి కాపాడుట అనిన్నీ అర్థము చెప్పుట కలదు. అది సరి కాదు. దుష్ట సంహారము అనగా చెడును మనోహరముగా ఒకచోటికి కూర్చి మార్చుట అని అర్థము. శిష్ట సంరక్షణము అనగా మంచిని చక్కగా పెంచుట అని అర్థము. ఈ దుష్ట సంహారము, శిష్ట సంరక్షణము అనునది మన శరీరములో ప్రతి క్షణము జరుగు చున్నట్టిదే. మన శరీరములో హృదయ పద్మము చైతన్యమునకు స్థానము. అచటినుండి, జీవ చైతన్యము ఈ శరీరమును నడపును. మన శరీరములో ప్రతి క్షణము కొంత భాగము చెడిపోవు చుండును. అలా చెడిపోయి దుష్టమైన దానిని ఎప్పటి కప్పుడు శరీరమునుండి

తొలగించు కార్యక్రమము ప్రతి క్షణము జరుగును. చెడిపోయిన రక్తము ఇతర మలిన పదార్థములు అన్నియు హృదయము వైపునకు ఆకర్షింపబడును. అనగా సంహారము చేయబడును. అలా చేరిన చెడుగు ఊపిరితిత్తుల ద్వారా పవిత్రము చేయబడును. అలా పవిత్రమైన రక్తము శరీరము నంతటిని సంరక్షించుటకై హృదయకోశము త్రిప్పి పంపును. చెడు రక్తమును తన వైపుకు ఆకర్షించుట మంచి రక్తమును శరీరమున కంతటికి పంచిపెట్టుట అన్న కార్యక్రమమును మన గుండె నిర్వహించును. ఇదియే దుష్ట సంహారము, శిష్ట సంరక్షణము అటులనే భూమియున్నూ చేయుచుండును.

మన కక్కరలేని చెడు పదార్థముల నన్నిటిని భూమి స్వీకరించును. అలానే జంతువులన్నీ వదలివేయు చెడు పదార్థములనూ భూమియే స్వీకరించు చుండును. చెట్ల కక్కరలేని ఆకులను, పండిపోయిన పండ్లు వగైరాల నన్నిటిని భూమి స్వీకరించును. మానవులు పశుపక్ష్యాదులు విసర్జించే మలమూత్రాదుల నన్నిటిని భూమి సంహారము చేయును. అనగా తనలోనికి చక్కగా నమర్చు కొనును. ఇలా మనకు దుష్టమయిన మల మూత్రాదులను చెట్లకు పనికి వచ్చే ఆహారముగా సమకూర్చును. మనకు దుష్టమయిన దానినే చెట్లకు శిష్టమైన దానినిగా ఏర్పాటు చేయును. చెట్ల కక్కరలేని ఎండుటాకులు చెత్తచెదారము నంతటిని స్వీకరించి సరిపరచి చెట్లకు చక్కని యాహారముగా మార్చి యందిం చును. ఈ యోగక్రియ భూమియున్నూ ఎల్లప్పుడూ చేయుచునే యుండును.

నీరున్నూ ఈ పని చేయుచుండును. మన కక్కరలేని విష పదార్థము లను నీరు గ్రహించును. దానిని మూత్రము రూపమున వెలుపలకు త్రోసి వేయును. ఆ స్థానమున మంచినీరుగా మరల మన శరీరములోనికి ప్రవేశించి శరీర వ్యాపారమును నడపు ప్రాణ ప్రవాహముగా నీరే పనిచేయును.

మూడవదియగు నగ్నియున్నూ యీ యోగక్రియను నడపుచునేయుండును. మనలోని చెడు నంతటినీ దహించివేయుచుండునది యీ యగ్నియే. అగ్ని యొక్క ప్రభావము వలన మనము స్వీకరించిన యాహారము పచనమై శరీరము లోనికి జీర్ణమై పోవుట ఈ యగ్ని యొక్క ప్రభావము వలననే. మనలో నక్కర లేని విషములను వెడల నడచునట్టి శక్తి శరీరాని కీయగ్ని దీప్తివలననే లభించు చున్నది.

ఇదే విధముగా సూర్యభగవానుడూ చేయుచున్నాడు. తన చుట్టూరా తిరుగుచూ తననాశ్రయించి యున్న భూమి యొదలగు గ్రహములకు కావలసిన రక్షణ శక్తిని సూర్యుడే పంచిపెట్టుచుండును. ఆ సూర్యతేజము వలననే భూమికి తానుగా తన చుట్టూరా ప్రదక్షిణము చేయుశక్తి లభించును. భూమికి యీ యాకర్షణశక్తి, - ప్రాణశక్తి - విద్యుత్తు-జ్ఞానేచ్ఛా శక్తులన్నియు ఆ సూర్యుని నుండియే లభించుచున్నవి. ఈ గ్రహముల కక్కరలేని దంతయు మరల సూర్యునిలోనికే తిరుగు ప్రయాణము చేయుచుండును.

ఈ రాకపోకలు సంహార సంరక్షణములు రెండూ సద్గురువుల సాన్నిధ్యముననూ జరుగును శ్రీ శాస్త్రిగారి సన్నిధిన మాకిట్టి యనుభవములు తిరుపతిలో సదా లభించెడివి.

ప్రార్థన సమావేశములకు వచ్చే శిష్యులు పలుతీరుల వారుందురు. విద్యార్థులు, లాయర్లు, డాక్టరులు, విద్వాంసులు, కవీశ్వరులు, టీచరులు, ఇలాటివారు పలు వయసులవారు వచ్చి కూర్చుండెడివారు. వారివారి సంస్కారములు వేరు. అలవాటులు, ఆచారములు, అన్నీ వేరువేరుగా ఉన్నప్పటికిన్నీ అవియన్నియు శ్రీవారి దివ్యమగు ప్రేమలో నాదిగిపోయెడివి. అందరు చక్కగా తిన్నగా ఒదిగి వారి సన్నిధిన భక్తి విశ్వాసములతో కూర్చుండిపోయెడివారు. ఆ కూర్చున్నవారి మనస్సులలో గంతులు వైచే కోపతాపములు ఆవేశ కావేశములు మొదలయినవన్నీ శ్రీవారి సాన్నిధ్యములో చల్లబడిపోయెడివి. ఆ వచ్చినవారి శరీరములలో గల బాధలూ పలు తీరులుగా నుండెడివి. ఒకరికి కాలునొప్పి, ఇంకొకరికి కడుపు నొప్పి. మంట, మరొకరికి తలనొప్పి, జ్వరము, మాంద్యము ఇలాటివన్నియు క్రమముగా సర్దుకొని లేచి చక్కగా ఒకదారినిబట్టి వెడలిపోయెడివి. ఈ ఆధి వ్యాధుల బాధలన్నియు చక్కగా నొక దండగా కూర్చబడి యొక హారముగా రెగ్యులేవను జరిగెడిది. ఇది జరుగుచున్నటుల బయటికేమీ కనుపించదు. పై పటాటోపమేమీ యుండదు. అలాటి సంహారము కూర్పు జరుగుచున్నట్లుగా సాధకులకూ స్పష్టముగా నప్పటికప్పుడు తెలిసెడిదిగాదు. ప్రార్థన సమావేశానంతరమున మాత్రమే సాధకులు ఆ యోగక్రియ జరిగినటులు తెలిసికొనేవారు. ప్రార్థనకు వచ్చి కూర్చున్నపుడు వారివారి శరీరములలోనున్న బాధలేవీ ప్రార్థనానంతరము వారిలో నుండెడివికావు. పోయెడివి. ఎప్పుడు, ఎలా పోయినదీ వారే యెరుగరు. అంత నిశ్శబ్దముగా ఈ దుష్ట సంహారక్రియ తిరుపతిలో శ్రీ శాస్త్రిగారి సన్ని

ధిలో జరిగిపోయెడిది. అందరియందు వారు ప్రవహింపచేయు ప్రేమ ప్రవాహ మట్టిది. ఎన్నోరోజులుగా, నెలలుగా, ఏండ్లుగా బాధపడువారు వచ్చి శ్రీ శాస్త్రి గారి సన్నిధిన ప్రార్థనలో కూర్చుండేవారు. ఎన్నో నెలలుగానున్న జ్వరమనే విష మచ్చట పనిచేసేదికాదు. బాధలయొక్క సర్వీసు రిజిష్టరులు లెక్కలోనికి వచ్చేవిగావు. ఎంతో తీవ్రమయిన బాధలన్నవి లెక్కలోనికి వచ్చేవిగావు. ప్రాణా పాయకరమగు వ్యాధియన్నదీ ఒక కొలతగా పనిచేసేదిగాదు. పెద్దపెద్ద డాక్ట రులే, "ఈ రోగము నయముగాదు", "ఈ రోగి ఇక బ్రతుకడు" అని యిచ్చిన సర్టిఫికెట్టులూ నిలచేవిగావు. నిలువకపోగా వ్యాధుల నివారణమునకీ సర్టిఫికెట్టులు తోడుపడెడివి. పెద్ద డాక్టరుగారు లాభము లేదన్నారు, కాబట్టి ఆ రోగులు డాక్ట రులమీది యాసలు వదలుకొనేవారు. భగవదనుగ్రహము నొక్కదానినే నమ్ము కొని, శ్రీవారి సన్నిధికి వచ్చేవారు. కావున వారికి తప్పక 'రిలీఫ్' కలిగెడిది. వారు వెంటనే స్వస్థతను పొందేవారు. ఈ పెద్ద డాక్టరుల సర్టిఫికెట్టులిప్పుడు కూడ, రోగుల రోగనివారణమునకు చక్కగా నుపయోగపడుచున్నవి.

ఇలా శిష్యులయొక్క శరీరములలో నున్న బాధలన్నీ ఆ గురువుగారి లోనికే వెళ్ళిపోవుటయున్నూ, శిష్యుల మనసులోని యాందోళనలన్నీ ఆ గురువు గారిలోనికే వెళ్ళిపోవుటయున్నూ జరిగెడిది. అంతటితో నాగక శిష్ట సంరక్షణ మున్నూ అదేకాలమున జరిగిపోయెడిది.

జీర్ణకోశము సరిగా నుండనివారి కాబాధ తొలగుటయే గాక, మంచి జఠరాగ్ని దీప్తి కలిగెడిది. మంచి యాకలి, రుచి, చిగురు తొడిగెడిది. నిస్తేజ ముగా, నిరుత్సాహముగా ఉసూరుమంటూ వచ్చినట్టి శిష్యులు చిచ్చుబుడ్డి తమలో వెలుగుచున్నటులు గుర్తించేవారు. ఎంతో ఉత్సాహముతోపాటు కొత్తశక్తి ఏదో వారిలో ప్రవేశించుచున్నటులు స్పష్టముగా వారు తెలిసికొనేవారు. పూనిక యున్నూ, ధైర్యమున్నూ నిండుగా లభించెడిది. నేను రోగినన్న భావము వెంటనే తొలగిపోయెడిది. మనసు తేరుకొని తేలికపడెడిది. జీవితమునందు మంచి యాసక్తి, కార్యములయెడ నుత్సాహము శిష్యులకు లభించెడిది. ఇది యొక దివ్యానుభవము.

[సశేషము]



# గాంధి రామాయణ సంకలనము

[గత సంచిక తరువాయి]

## 13

గాంధీజీ మరణాంతరము నా హృదయములో పెక్కు భావములు సంచారము చేసినవి. అందు మొదటిది "భారతదేశము నిరాధారము, అనాయకము అయిపోయినది. ఈ భారతీయ జాతీయ రథమును క్రమ మార్గమున దోలు చోదకుడెవ్వరా?" యనునది. ఇప్పటిలో మరణమును వాంఛింపని మహాత్మునకీ యకాల మృతియేమి? స్వేచ్ఛా మరణమును సాధింపనెంచువానికా యీ దుస్సంఘటనము? కొంచెసేపటివఱకు నాకేమియును దోచలేదు. గుండె పనిచేయమానినదా? యని తలంచితిని. కాని కొట్టుకొనుచునేయున్నది. కొంతవడికి బాహ్య ప్రపంచ స్మృతికివచ్చి ప్రపంచమున శాంతిమార్గగాములకు మార్గదర్శకుఁడెవడా? యని విచారింప జొచ్చితిని. దుఃఖముకాదుగాని దానిని బోలిన హృదయ బాధ నన్ను కలంచినది. సోక్రటీసు మరణగాథ, జీససు ప్రభుని నిర్యాణకథ నా మనస్సులో మెదలినవి. కృష్ణచంద్రుని కిరాతుడు హతమార్చుటయు నిట్టిదేయని సరిపెట్టుకొన దలంచితినిగాని, అది యా కిరాతుడు తెలియక చేసిన కార్యము. ఇది యీ కిరాతుడు బుద్ధిపూర్వకముగా చేసినట్టిది. పోలిక చాలదనిపించింది. సోక్రటీసు, జీససుల మృతులు వారికిఁదెలియును. ఇది మహాత్మునకెఱుకలేదు. దీనికిదియే సాటి యేమో !

సత్యమైనను నవ్యసిద్ధాంతమును బ్రచారము చేయువారికిట్టి కడగండ్లు తప్పవు కాబోలుననిపించెను.

ప్రపంచము నందలి ఆధ్మాత్మిక పురుషులను, వారి సిద్ధాంత సాధన ప్రణాళికలను నిరంతరము మననము చేయు నలవాటుండుటచే గాంధీజీని గూర్చి యింకను పలుతలంపులు నా మనోవీధి సంచారము చేసినవి.

బుద్ధునిలోను, జీససుప్రభునిలోను ఆధ్యాత్మిక ప్రభావమెక్కుడుగా గన్పట్టును. వారాత్మ శక్తి నుద్దీపింపజేసి మానవాత్మ సంస్కారమునకే ప్రధానముగా గృషి సల్పినారు. సంఘ సంస్కారమును తదనుసారమే యొనర్చిరి.

గాంధీజీ ఆధ్యాత్మిక ప్రభావముచే మానవుని సాంఘిక, నైతిక, రాజకీయ జీవితములలోనూ తగు పరిణామమును దెచ్చుటకుద్యమించినాడు. అచంచలమగు భగవద్విశ్వాసము చేతను, సత్యాహింసల పూర్ణానుష్ఠానము చేతను బ్రహ్మచర్యాది నియమపాలనముచేతను ఒక లోకోత్తరత్వమును సాధించి జీవితమును ప్రేమ పూర్ణమును, కారుణ్యభరితమును జేయుట కాతడెంతయో శ్రమించినాడు. అందు కాయన మంత్రములను గాని మందులనుగాని ఉపయోగింపలేదు. అచంచలమగు మనోబలమునే, ఆత్మశక్తినే నమ్మి కృషి సల్పెను. చెక్కుచెదరని ఆత్మ విశ్వాసము, ప్రేమోపాసనము ఆయన ప్రతిరక్తాణువులోను జీర్ణించి క్రొత్త మార్పును సంఘటించినవి. భౌతికధాతువునుండి చేతనాధాతువులోని కాతని ప్రయాణము పర్యవసన్నమైనది. అందాతడు కృతకృత్యుడో కాదో చెపుటకు నాకు శక్తి చాలదు. ఈనాటి అరవిందాదుల యోగ ప్రణాళికల నాతడు స్వోపజ్ఞముగా గుర్తించి అనుష్ఠించి పూర్ణత్వమును సాధింప జూచెను. ఆ దృష్టితోడనే 125 సంవత్సరముల జీవిత ప్రమాణము నాతడు వాంఛించినాడు. ఆతడనుష్ఠింప నెంచిన పూర్ణయోగము ముగియుట కీశ్వరునకే యిష్టములేదేమో! కావుననే ఆ యకాలమృతి మహాత్మునకు సంభవించియుండును.

ఏది యెట్లయినను తుపాకి గుండ్లదెబ్బ తినియు "హా రామా!" యని అసువులబాసిన మహాత్ముని మహితాదర్శము, అంతిమయాత్ర అసదృశమై జిజ్ఞాసువులకు సాధకులకు అపూర్వ పాఠములను మప్పుచున్నది.

—కొండూరు వీరరాఘవా చార్యులు
పండితుడు, హైస్కూలు
సత్తెనపల్లి.
2-2-50.

## 14

శ్రీ మహాత్మా గాంధీజీ అహింసావాది. ఆ మహాత్ముడు లేనియెడల మనకు స్వరాజ్యము వచ్చెడిదికాదు. మన భారతదేశము చిరకాలము బానిసత్వములో ఉండ వలసివచ్చెడిది. కాని వారు మన పాలిటనేగాక ప్రపంచమంతటికీ కూడా యుగ పురుషుడుగా జన్మించెను. ఆయన సిద్ధాంతమే గొప్పది. ఆయనను గురించి హిందీలో ఒక కథ ఉన్నది. గాంధీజీ తన స్నేహితునితో షికారుచేయుచుం డెన్న.

కొంత దూరము వెళ్ళినమీదట గాంధీజీ స్నేహితుని చొక్కా జేబులో చేయిపెట్టెను. దానిలో ఒక కత్తిదొరకెను. "ఈ కత్తితో మీకు అవసరం ఏమిటి?" అని గాంధీజీ స్నేహితుడిని అడిగెను. "మిమ్ములనెవరో చంపెదరట. అందువల్ల మీ రక్షణను గురించి ఈ కత్తితో కాపలాకాయుచున్నాను" అని స్నేహితుడు జవాబు చెప్పెను. "నేనే ఈ కత్తితో ఆత్మహత్యను చేసుకొన్నచో నీవేమి రక్షింపగలవు? అందుచే దీనివి దూరముగా పారవేయుము! ఇట్లెన్నటికిని తలంచకుము! ఎవరిని వారే రక్షణను చేసుకొనవలెను! ఒకరొకరిని రక్షింపజాలరు అని తెలుసుకొనుము!" అని మహాత్ముడు బదులుచెప్పగా అతడు వెంటనే దానిని దూరముగా పారవేసెను.

గాంధీజీ మొదట తాననుభవించిన క్రియానుభవాన్ని అందరికి తెలియజేసెడివారు. ఇదియే ఆయన సిద్ధాంత మహత్వము.

ఇదివరకు, ఇప్పుడు, పెట్టిన పెట్టుచున్న శాసనములు అనుభవము లేనివి. అవి ప్రజలమీద అక్రమముగా రుద్దపడుచున్నవి మహాత్ముడు అట్లుకాక తానే చేసి చూపెడివారు.

1947లో గాంధీజీని చంపుటకెవరో ప్రయత్నించుచున్నారని పటేలు నెహ్రూజీలు కొంత సిబ్బందిని ఆయనకు కాపలాకై పంపిరి. ఆ విషయమును తెలుసుకొని ఆయన అహింసా సిద్ధాంతమునకది వ్యతిరేకమని చెప్పి వారిని తిప్పి పంపివేసెను.

ఇట్టి రాజకీయ ఆధ్యాత్మికవేత్త, ఇట్టి ఋషిపుంగవుడు ఇదివరకు పుట్టియుండలేదు. ఈయన కలియుగమునందు అధర్మమును పోగొట్టి అహింసాశక్తి ద్వారా ధర్మమును స్థాపించుటకై మన పాలిట భగవానుడై వెలసినాడని నా నమ్మకం. ఎట్లంటే- "ఎప్పుడెప్పుడు ధర్మమునకు హాని కలుగుచున్నదో, అప్పుడు ధర్మసంస్థాపనార్థమై అవతరింతును" అని శ్రీమద్భగవద్గీత యందు శ్రీకృష్ణుడు చెప్పియున్నాడు. అట్లే ధర్మసంస్థాపనార్థ మవతరించిన అవతార మూర్తి బాపూజీ అని నా దృఢవిశ్వాసం.

-తస్నేరు శివమూర్తి
ఆలపాడు
24-1-1950.



# గాంధీ శతకము

[విద్వాన్ బయిరెడ్డి సుబ్రహ్మణ్యంగారి యీ శతకానికి వేటూరి వారు వ్రాసిన ముందుమాట యిది—సం॥]

## విద్వజ్జనాభిప్రాయము

'గాంధి శతకము'ను రచయిత వినిపింపఁగా నామూలాగ్రము హాయిగా వింటిని. ''రాఘవేశ్వరు చారిత్రము నెంద తెన్నిగతులన్ వర్ణించినన్ గ్రాలదే?'' అన్నట్టు ''గాంధిదేవ చరిత్రంబును నెందతెన్ని గతులన్ వర్ణించినన్ గ్రాలదే!'' ఈ శతకము పద్యములు ధారాళముగా నిర్దుష్టముగా నున్నవి.

గాంధిగారి ''ధారాళమయిన నీతులు'' కొన్నియును, చరిత్రాంశములు కొన్నియును నిందు సంధానితములైనవి. విద్యార్థులకీ శతకమును సుమతి నీత్యాదులవలె నేర్పవచ్చును.

తిరుపతి,
16-6-'48.

—వే. ప్రభాకరశాస్త్రి

| | | |
|---|---|---|
| శతకము | — | గాంధీ శతకము |
| కవి | — | విద్వాన్ బయిరెడ్డి సుబ్రహ్మణ్యం |
| ప్రచురణ | — | 40, భారతీ నికేతనము, తిరుపతి. |

"దీనిని సరిచూచి, సముచిత సలహా లొసంగి, తమ యభిప్రాయము వ్రాసి యిచ్చిన మద్గురువరేణ్యులు శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి నా హృదయ పూర్వక నమశ్కృతములు'' అని-

—''తొలిమాట''లో
గ్రంథకర్త.

చాలా మందికి ఈ శతకాన్ని గురించిగాని, శాస్త్రిగారి శిష్యుడే దీన్ని వ్రాశారని గాని తెలియదు. మనకు తెలిసినదంతా 1924 జనవరి, భారతి, ప్రథమ సంచికలో శ్రీ మంగిపూడి వేంకటశర్మగారు రచించిన 'గాంధి శతకము', మాత్రమే. భారతీ పత్రికా స్థాపనకు ప్రేరకులు ప్రభాకరశాస్త్రిగారే అయినట్లు, శ్రీ బయిరెడ్డి సుబ్రహ్మణ్యంగారు శాస్త్రిగారి శిష్యులే అవడం గమనార్హం. 1948 లో గాంధిగారి నిర్యాణానంతరం ''గాంధి రామాయణము'' సంకలించ డానికి సంకల్పించిన శ్రీ గురుదేవులు తమ శిష్యుడే వ్రాసిన 'గాంధి శతకాన్ని' సరిచూచి అభిప్రాయమివ్వడం గాంధి దేవుని పట్ల వారికున్న శ్రద్ధాభక్తులు విశదపరుస్తున్నది.

— సేకరణ - వివరణ : ముదివేడు ప్రభాకరరావు

# చాటువులు

## చిత్ర కవితా రచనలు

— వేటూరి ప్రభాకరశాస్త్రి.

[చాటు పద్యాల్ని ఆసక్తికలవారు ఎవరైనా సేకరించవచ్చు. కాని వాటిలోని చమత్కారాల్ని గుర్తించి రసవత్తరంగా వ్యాఖ్యానించగలవారు కొద్దిమందే ఉంటారు. అట్టి వారిలో శ్రీ ప్రభాకరు లగ్రగణ్యులు. ఇట్టి చిత్ర కవితా రచనల్ని కొన్నిటిని శ్రీ శాస్త్రిగారు 15-7-1942 ఆంధ్ర వారపత్రికలో వివరించారు. పరికించండి. —సం॥]

ద్రవిడాంధ్రములలో కలగలపు భాషల పద్యాలు బహుకాలము నుండీ ఉన్నవి. కలగలుపు భాషకే మణిప్రవాళ భాష అని పేరు. పాల్కురికి సోమనాథుడు వృషాధిప శతకములో మణిప్రవాళ భాషాపద్యములు రచించినాడు. ద్రవిడ సంస్కృతముల కలగలపు చాటుపద్య మొకటి.

మణల్భ్యోవాంగలాం తైలం
కల్లుభ్యోవాంగలాం త్వచమ్,
పులిభ్యోవాంగలాం క్షీరం
త్వత్తః కించిన్న వాంగలామ్.

యాచకు డొకడు లుబ్ధుడయిన ధనికుని గూర్చి చెప్పిన పద్యమిది.

ద్రవిడాంధ్ర భాషలలో చమత్కృతికై యిట్టి రచనలు వెలసినవి. కాని మళయాళ భాషలో కవితారచన లెల్లను మణిప్రవాళ భాషాత్మకములే. మాదిరి కొకటి.

అకృతికండా లతిరంభేయం
అరావలిపశ్దన్ అధరం పేయం,
అకృత్రిమద్యుతి రనావధేయం
అడుత్తి చెన్నిని అనుపశ్యేయమ్.

—నలచరిత్ర కథాకళి.

చాటుపద్య మణిమంజరిలో నింతకుముందు చేరనివి కొన్ని కలగలపు భాష పద్యాలు.

భోజనం ఈగ సంకీర్ణం
దోమ సంకీర్ణ మందిరమ్,
శయనం నల్లిసంకీర్ణం
దేహి మే కుంటికూనమా !

పాండవ గీతలలోని యీ క్రింది శ్లోకము మీది శ్లోకమున తల్లక్రిందు లయినది.

భోజనం మిత్రసంకీర్ణం
బంధుసంకీర్ణ మందిరమ్,
శయనం సుతసంకీర్ణం
దేహి మే మధుసూదన !

మఱియొకటి-

పత్యౌ సుప్తే చెనకి పలికెన్
నన్ను సారంతుకామా
నిద్రా కింతే, అదివినిబసీ
కాసి బాలే త్వమంటిన్
భితాభీతా కమలరుచినా
పాణినా నోరు మూసెన్
మందంమందం మధురవచసా
చాలు చాలి త్యవోచత్.

ఈ వరుస మఱికొన్ని శృంగార పద్యాలు వెకలి రచనవి కలవు.

భాషాద్వయ పునరుక్తాభాస శ్లోకము భాషా శ్లోకము :

అంబలిద్వేషిణం వందే
చింతకాయ కృతాదరమ్,
కూరగాయ కృతాతానం
పాలనేతి ప్రియంగవామ్.
భాండే జలంవా తక్రంవా
నీరోమోరో వదాంగనే

(నిర్ + రోమ + ఊరు; బహువ్రీహి సంబుద్ధి.)

మార్గమాలోక్య గంతవ్యం
ముల్లుస్స్యాత్ తత్ర కంటకః.

(ముదం లునాతి)

ఈ క్రింది పద్యము వర్తమానుఁడు కళ్ళన రచించినది.

వడపై, నావడపై, పకోడిపయి, హ
ల్వాతుంటిపై, బూంది యోం
పొడిపై, నుప్పిడిపై, రవిడ్డిలిపయిం
బోండాపయిన్ సేవియా
నుడిపైఁ బాబు భవత్కృపారసము ని
చ్చోఁ గొంత రానిమ్మ నే
నుడుకుంగాఫిని, మ్రొక్కు! గ్రుక్కఁగొనవే
యోకుంభదంభోదరా !

పై పద్య మీ క్రింది పద్యమునకుఁ దల్లక్రిందుల రచన.

అరయన్ శంతనుపుత్త్రిపై విదురుపై
నక్రూరుపైఁ గుబ్జపై
నరుపై ద్రౌపదిపై కుచేలునిపయిన్
నందవ్రజశ్రేణిపై
పరగం గల్గు భవత్కృపారసము నా
పైఁ గొంత రానిమ్మి నీ
చరణాబ్జంబులు నమ్మినాను జగదీ
శా! కృష్ణ! భక్తప్రియా!

## ద్రాభ భాష

ఆంధ్ర ద్రవిడ కర్ణాటక భాషలలో 'ద్రాభ భాష' యన్న వ్యవహార మున్నది. పాల్కురికి సోమనాథుఁడు "ద్రాభ, ఛందోవిరుద్ధం, బాదియగునలాభప్రలాపోక్తిలాఘవంబనక–" అని దీనిని పండితారాధ్యచరిత్రలో పేర్కొన్నాడు– కర్ణాటాంధ్రకవులు మఱికొందరు కూడా నీద్రాభభాషను గర్హించిరి. "ద్రాబ" యనియు గొందఱు కవులు దీనిని బేర్కొనిరి– ద్రాభభాష యెట్టిదో యీ క్రింది సీసమాలిక తెలుపుచున్నది.

సీ. బావగా రీసారె పనస వల్లించిండ
తాత యీ జంఝూలు తాలిచిండ
మామ యీ శ్లోకంబు మఱవక రాశిండ
గోవిందునికి నంగి కూరిశిండ
పెండ్లిసాగిన దింటఁ బెత్తనాన్కొచ్చిండ
మాపాతకంచాలు మూరిచిండ
శోపస్కరాలెల్ల రేపు తెప్పించిండ
మావద్ద హరుమైన మానిపిండ
అప్పన్న యీయాకు నొప్పుగా మడిచింత
కూసుండి యీ బట్ట కూరిచిండ
పెద్దత్త యీనంట పెసలు గాలించిండ
వణ్ణంబు మెత్తగా వారిశిండ
పులగూర వండిండ బూరెలనెంచిండ
ఆ చిన్నవానికి నప్పచిండ-

నడిపత్త సెగదాకి బడలిక పడుసుంది
రూపత్త పప్పులు రుబ్బుసుంది
నిలువుఁడీ మనవాఁడు నీళ్లలు దెస్సాడు
కాఁగులో వేన్నీళ్లు కాపుసాడు
ఈశ్వరభట్లు దానింటికి భోసాడు
భానుభట్లింటికిఁ బాఋసాడు

అనుచు ముదుముళ్లపల్లెఃగహారమునను
శోభనము సేయుచుందురు ద్రావిభాష
ఎట్లు నిర్మించె నాతలకొట్లమూరి
బ్రహ్మ యిటువంటి పరిపాటి బ్రాహ్మణులకు.



# చాటుపద్య-మణిమంజరి

[ సంకలనము ]

—వేటూరి ప్రభాకరశాస్త్రి

## వలపు - వక్కాణ

### శ్రీమతి - ప్రియుడు

శ్రీమతి కంగనాగమణికిఁ జిన్ని యొయారికి ముద్దులాడికిన్
సామజ యానకున్ మిగులఁ జక్కనియింతికి మేలు గావలెన్
మేమిట సేమ మీ వలకు మీ శుభవార్తలు వ్రాసి పంపి మా
క్షేమముఁ గొల్పుమీ! కరుణ జీవము నిల్పుమి శ్రీకళావతీ!

* * *

అంటినఁ బల్లవించు మదనాంకుర బీజములోనఁ గల్గి ని
ష్కంటక మాతులుంగ ఫలకాంచనభాసుర కాంతిఁదోచి ము
క్కంటికి బ్రహ్మకున్ హరికిఁ గన్నుల పండువుసేయుచుండునా
దింటెన పూవు వంటి పరదేవత మిమ్ము ననుగ్రహించుతన్.

* * *

నిష్కపటపు స్నేహముగల
పుష్కరలోచనల పొందు పొందున జానే
నిష్కపటపు స్నేహము గల
పుష్కరలోచనల పొందు పొందు న జానే.

* * *

వాసన గుల్కు మేను నిడువాలు కనుంగవ గబ్బి గుబ్బలుం
గేసరి మధ్యమున్ మదనకేళికి నింపగు బాహుమూల వి
న్యాసముఁ గల్గినట్టి యెలనాఁగను బోగముదానిఁ జేయ కా
దాసరిదానిఁ జేసిన విధాతను నేమనవచ్చు నీశ్వరా !

చీరయు ముక్కు ముంగరయుఁ జెంపల గంధముఁ జుక్కబొట్టుమం
జీర ఝణం ఝణారవముఁ జేతులఁ గంకణ నిక్వణంబు నొ
య్యారపుఁ జాలుఁ గొప్పును గయాళితనంబును దానిలోన సిం
గార మొకింత లేదనుటఁ గంటిని యీ పురి వారకాంతలన్.

* * *

బంగారు వంటి మేనును
శృంగారము లొలుకు కులుకు చిక్కని చన్నుల్
బంగారపు నెర చీమల
చెంగటి చూపులు నియోగి చేడియ కొప్పున్.

* * *

సెలవా ముద్దుల గుమ్మా
సెలవా బంగారు బొమ్మ సెలవా కొమ్మా
సెలవా రత్నపు దిమ్మా
సెలవా యపరంజి బొమ్మ సెలవందిమ్మా!
సెలవా కాఠిన్యస్తని
సెలవా బింబాధరోష్ఠి చంద్రనిభాస్యా
సెలవా నను దయఁ జూడుము
సెలవా నేఁ బోయివత్తు సెలవా చెలియా!

* * *

కమలవైరి వైరి కాంతకు మధ్యంబు
కమలవైరి వైరి కాంత యూరు
కమలవైరి వైరి కాంత కుచంబులు
కమలవైరి వైరి కాంత కచము.

* * *

రమణీయ ముఖ దర్పణముఁ జూప నా వంతు
వగ గుల్కు వీక్షింప వంతు నీది
అధరబింబ ఫలంబు నర్పింప నా వంతు
వాంఛ నాస్వాదించు వంతు నీది

కమనీయకుచ కందుకము నియ్య నా వంతు
పదలక చేపట్ట వంతు నీది
అవశత్వమున దేహ మందీయ నావంతు
స్వవశంబుగాఁ గొను వంతు నీది
సంతసం బాత్మ నినుఁ జేర్ప వంతు నాది
వింతగా నైక్యమును గూర్చువంతునీది
ఎన్నటికి నివె వంతంబు లిద్దఱకును
భానుచంద్రులు సాక్షిగా ప్రాణనాథ!

* * *

ఏ మందును నే మందును
నే మందును మందయాన యేమని యందున్
ఏమని నేమని పలుకుదుఁ
దామర వికసించి రక్తధారలు గురిసెన్.

కేశికఁ దేలిన పిడపను
బాలిక రిపుఁ బోలుఁ బంచబాణునిఁ బోలున్
మాలకరిఁ బోలు గుఱ్ఱపు
నాలుకతుదఁ బోలు హేమనగముం బోలున్.

* * *

# పద్య లేఖ

[ఈ లేఖ వేటూరివారు తమ బాల్యమిత్రులగు శ్రీ చల్లా సూర్యనారాయణ శాస్త్రిగారికి వ్రాసినది. ఆనాళ్లలో ముక్త్యాల ప్రభువులు నిర్వహించుచుండిన సరస్వతి పత్రిక ముద్రణమును చల్లావారు చూచుచుండిరి. పత్రికకు వ్యాసములు తరుచు పంపుచుండవలెననీ సరస్వతిపై చిన్నచూపు వలదనీ చల్లావారు వ్రాయగా వేటూరివారు బదులిట్లు వ్రాసిరి. నాడేకాక నేడును పత్రికాధిపతులు పరిశీలింపదగిన విశేషము లిందున్నవి. —సం॥]

[illegible]

[illegible]

2. [illegible]

3 [illegible]

4 [illegible]

5 [illegible]

# శివయోగసారము* — అవతరణిక

—వేటూరి ప్రభాకరశాస్త్రి

[సుభాషి - నవంబరు 1927 పుటలు 74 - 79 – సం॥]

ఈ 'యవతరణిక' యింతవఱకు నేఁటి గ్రంథపరిశోధకు లెవ్వరుగాని తడవిచూచినదిగాఁ దోఁపదు. ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నీయవతరణిక లేదు. బ్రౌను దొరగారు 'అనియాది . గణపతిదేవుఁడని' వ్రాసినదానినే శ్రీ వీరేశలింగము పంతులుగారు కవులచరిత్రమున ననువదించిరి; గాని యాశ్వాసాంత గద్యములను వారు సరిగా బరిశీలింపరయిరి. మఱియుఁ బంతులుగారు దానిని మిక్కిలి యర్వాచీనమైన కృతినిగాఁగూడఁ దలంచిరి. కవుల చరిత్రము తృతీయ భాగమున దాని విషయముఁ జెప్పిరి. వారి వ్రాఁతను నమ్మి యాగ్రంథమం దాదరము లేనివాఁడనై నేనును నక్కడక్కడఁ గానవచ్చిన వ్రాఁతప్రతులను సేకరింపనయితిని! ప్రాచ్య లిఖిత పుస్తకశాలలో నాలుగు పుస్తకములున్నను నవి భిన్నప్రతులుగావు; సమగ్రములునుగావు. ఈ గ్రంథము వ్రాఁతప్రతులున్న స్థలములు కొన్ని నాకు జ్ఞప్తిలోఁ గలవు గాన వాని నిఁక సేకరింపఁ బ్రయత్నింతును. ఈ యవతరణికను దొలుత సేకరించినందుకు మా మిత్రులు శ్రీ విశ్వనాథశర్మగారిని సంభావించుచున్నాఁడను.

శ్రీ వీరభద్రరావుగా రీయవతరణికలోని ముఖ్యవిషయములను బెక్కింటిని బరిగణించిరి. నాకుఁ గానవచ్చిన విశేషవిషయములఁ గొన్నింటినిగూడఁ దెలుపుకొనుచున్నాఁడను.

౧

ఇందు వర్ణితులయిన కృతికర్తవంశమువారును, కృతిపతివంశమువారును ఆంధ్రారాధ్యబ్రాహ్మణులు. 'నూకనారాధ్యవరా' ఇత్యాది సంబోధనములు పెక్కులు గలవు వీరు లింగధారులుగారు, కృతిపతియగు నూకనారాధ్యుఁడును, దత్పితయగు నాగయయుఁ బాశుపతవ్రతులు. నాగయనుగూర్చి "కాశిలోఁ గదలక పాశుపతవ్రతశీలుఁడై మోక్షమార్జించి మించె"ననియు, నూకయనుగూర్చి "కాశికాదేశముఖ్యప్రదేశములఁ జరించి కులకోటులను నుద్ధరించెనట్టె'' అనియు గలదు. శివయోగసారము కడముట్టఁ జదివినను గూడ నెక్కడను లింగధారణము, కరపీఠార్చనము మొదలగు వీరశైవాచారములు కానరావు. అంతరలింగార్చనము, పీఠలింగార్చనము నందుఁ జెప్పఁబడినవి. ఆంధ్రారాధ్యసంప్రదాయము

వీరశైవసంప్రదాయముకంటె వేఱయినది యనియు, ఆంధ్రారాధ్యులు పాశుపతసంప్రదాయమువారనియు దీనివలనఁ గూడ నిరూపితమగుచున్నది. మఱియు నేతత్కృతికర్తృ కృతిభర్తృవంశములవారి కేలికలయిన కాకతీయగణపతిచక్రవర్తికి, రుద్రాంబికకుఁ, బ్రతాపరుద్రునకు విశ్వేశ్వరశివాచార్యుఁడును, దత్పుత్రుఁడు కాశీశ్వరశివాచార్యుఁడును ననువారు గోళకీమఠాచార్య పట్టాభిషిక్తులు దీక్షాగురువులు. తత్త్వద్విషయములుగొన్ని బసవపురాణపీఠికలో వివరించితిని. వారు మందర గ్రామమున నెలకొల్పిన మహావిద్యాపీఠమనఁదగినపీఠమున

విద్యార్థిభ్యోఽ పరంభాగం శుద్ధశైవమఠాయచ
ప్రసూత్యారోగ్యశాలాభ్యాం విప్రసత్త్రియచేతరమ్
ప్రాదాద్విశ్వేశ్వర శివశ్శివసిద్ధాంతపారగః
ఋగ్యజుస్సామవేదానాం సమ్యగధ్యాపకాస్త్రయః
పదవాక్యప్రమాణానాం సాహిత్యస్యాగమస్యచ. —ఇత్యాది.

పై శ్లోకములందు 'శుద్ధశైవమఠ'మని కలదు. శుద్ధశైవమనఁగా :

మిశ్రశైవ మితిప్రోక్తం శుద్ధశైవ మథశ్రుణు
సింహాసనస్థితంలింగ మర్చయేద్దేశికోత్తమః
నిత్యం త్రికాలం భక్త్యా యః లింగార్చనరతస్సదా
ఆగమార్థానుసంధాతా మదమోహాదివర్జితః
ధ్యానజ్ఞానసమాయుక్త ఆరాధ్యస్తేన కథ్యతే
భూతిరుద్రాక్షసంయుక్తో భజన్కాత్రయే శివమ్
శుద్ధశైవమితిప్రోక్తం శ్రౌతశైవ మథోచ్యతే.

మీఁది శ్లోకములలో నిర్వచింపఁ బడిన పద్ధతియే యాంధ్రారాధ్య సంప్రదాయము వారిది. కాకతీయ చక్రవర్తులు వారి గురువులగు విశ్వేశ్వర శివాచార్యాదులు ఆంధ్రదేశమున బెంపొందించిన శైవసంప్రదాయమిదియే. నేఁటి యాంధ్రారాధ్యవర్యులు వీరశైవసంప్రదాయమువారని తలఁచుట సరిగాదనియే నా నిశ్చయము. బసవపురాణపీఠిక చూడఁ గోరెదను.

౨

మఱియు నీయవతరణికలో రుద్రమదేవి కూఁతురగు రుయ్యంబను నారాధ్యబ్రాహ్మణుఁడగు నన్నయదేవుఁడు పెండ్లాడినట్లు స్పష్టముగాఁ గలదు. దీనిని జూచిన తరువాత దీనికి సంవాదిగా నింకొక విషయము నాకుఁ గానవచ్చినది. మల్కాపుర శాసనమున—

శ్రీచోళేశ్వరమాళవక్షితిపతీ రాజన్యచూడామణీ
యచ్ఛిష్యౌ; కిమతః పరం గణపతిక్షోణీపతిర్యత్సుతః
నస్యాత్కస్య ముదే సదేశికవరశ్శైవాగమాంభోనిధి
శ్శ్రీవిశ్వేశ్వరదేశికః కలచురిక్ష్మాపాల దీక్షాగురుః.

అని శ్లోకమున్నది. "చోళరాజును మాళవరాజును విశ్వేశ్వరశివాచార్యునికి శిష్యులు. ఇఁకఁ జెప్పెడి దేమి? కాకతీయగణపతిచక్రవర్తి యావిశ్వేశ్వర శివాచార్యునికిఁ గుమారుఁడే'' యని దీని కర్థము శిష్యమాత్రత్వమేయగుచో చోళ మాళవరాజులతో పాటుగానే గణపతిపేరును జెప్పఁ దగియుండును. గణపతి చక్రవర్తికి విశిష్టశిష్యత్వమును దెలుపునదో లేక నిజముగాఁ బుత్రిత్వమునే తెలుపునదో పై శ్లోకము! శివయోగసారావతరణికలో రుయ్యాంబ విషయము గాన రాకున్నచో నిక్కడ విశిష్టశిష్యత్వము మాత్రమే యర్థమని తలఁతుము. ఇప్పుడు ఈ యర్థముకూడఁ గలదేమో యని సంశయము వొడమినది.

౩

కవిస్తుతిలో ''మఱియును సంధ్రకావ్యపథము దీర్చిన నన్నయభట్టుగారి...''నని కలదు. ఈ గణపతిదేవకవినాఁటి నన్నయభట్టారకునిఁ గూర్చి యెట్టి భావముకలదో యిది స్పష్టముగాఁ దెలుపుచున్నది! రాజనరేంద్ర సంచికలో నేను వ్రాసిన వ్యాసమున కిది బలము నొసంగుచున్నది.

౪

మఱియు—

క. అసమ శివభక్తిరసమా
నసునిం బాల్కురికి సోమనాథునిఁ గవిరా
జసమున్నతయశు, సద్యః
ప్రసాదియగు చక్రపాణి రంగనఁగొలుతున్.

అనియుఁ గవిస్తుతిలోఁగలదు. ఈ పద్యమెంతయు నాకు సంతోషము గొల్పినది. పాల్కురికి సోమనాథునితో స్పర్థించి చక్రపాణి రంగనాథుఁడనువైష్ణవుఁడు (తెలుఁగుదేశమువాఁడు) శివనిందచేయఁగా నాతని కన్నులురెండును బోయె ననియు, ఆహోబలనృసింహస్వామి కలలో శివనిందచే నీ కన్నులు పోయిన వని తెలుపఁగా నాతఁడు శ్రీగిరికిఁబోయి మల్లికార్జును నారాధించి యా స్వామిమీఁద సంస్కృతాంధ్రములలోఁ గొన్ని కృతులను జెప్పి పాల్కురికి సోమనాథునికి శిష్యుఁడై మరల రెండు కన్నులను బడసెననియుఁ బెక్కుకర్ణాటక కృతులలోఁ గలదు. పైకథార్థమును రూపించుచు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో ''రంగన'' కృతిగా నయనరగడ యని యొక గ్రంథము కలదు.

క. శ్రీపార్వతీశుఁ జూడక
పాపాత్ముఁడనగుచుఁ బోవఁ బథమునఁ జక్షుల్
దీపించుదృష్టి తొలఁగిన
శ్రీపతినడుగంగఁ జెప్పె శివుఁ గర్తనుగాన్

అని దానియారంభమునఁ బద్యము గలదు. బసవపురాణపీఠికలో నీ గ్రంథమును గూర్చి హెచ్చుగా వ్రాసితిని. నాల్గు చరణము లిక్కడ-

శ్రీశైలవల్లభుని శిఖరంబు పొడగంటి—
సభలందు భక్తులకు జయవాదమనికంటి—
గౌరీశుఁడే సర్వకర్తగాఁ బొడగంటి—
బహుపాపములు నన్నుబట్టువిడుచుట గంటి—
నయముగా నయనములు నాకీయఁ బొడగంటి—
ఇంక శ్రీగిరిఁజేర నేఁ గందు నని కంటి—
తనరశ్రీరంగకవి దాత యని పొడగంటి—

— ఇత్యాదులు.

వైష్ణవమప్పుడు రంగనాథుఁడే శైవుఁడై రంగకవియయ్యెను. "ఘనుఁడు రంగన దూషకరగండఁ డనికంటి" ననియుఁ గలదు. పైవిషయములను నీగణపతిదేవకవి కృత్యవతరణిక యథార్థపఱుచుచున్నది. నే వెల్లడించిన 'నయనరగండ' చక్రపాణి రంగనదే యగుననుట కిఁక సందేహింపరాదు.

౨౩

కొలనిరుద్రదేవుని వర్ణనమున "నరులెల్ల వ్యాకరణబ్రహ్మయన సకలాగమవిదుఁడయ్యె నట్టియితఁడు" - అని కలదు. ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోఁ 'రాజరుద్రీయ' మని యొక సంస్కృతవ్యాకరణ గ్రంథము కలదు. దానిఁగూర్చి తెల్గుదేశపు సంస్కృతకవుల చరిత్రమున నేనిట్లు వ్రాసితిని —"కాశికయని పేరు గల పాణినవ్యాకరణసూత్రవృత్తిలోనున్న కారికల నన్నింటిని శ్లోకవార్తికమను పేర నుద్ధరించి దానికి రాజరుద్రీయమను పేరఁ బ్రతాపరుద్రదేవుఁడు వ్యాఖ్య రచించినాఁడు. గద్యమిట్లున్నది. 'ఇతి రాజరుద్రవిరచితే శ్లోకవార్తిక వ్యాఖ్యానే ప్రథమస్యాధ్యాయస్య ప్రథమః పాదః' కొన్ని గద్యలు: 'ఇతి రాజరుద్రీయే కాశికా వృత్తిశ్లోకవ్యాఖ్యానే' అని కలవు. మఱియు నొక్కచోట నిట్లున్నది: "ఆది రాజకాకతీయ ప్రతాపరుద్రప్రధానపర్యస్య ముద్రాకగన్నయసూను రచితం వార్తికవ్యాఖ్యానమ్"—కావున నిది కాకతీయప్రతాపరుద్రుని కృతికానేరదు.

ఆ కాకతీయ ప్రతాపరుద్రదేవుని ప్రధానవర్యుఁడును, గన్నయకుఁ గుమారుఁడును నయిన రుద్రరాజు రచించినది. ఇదివఱకు నే నీగన్నయ మార్కండేయ కృతిపతి యగు నేమోయనుకొంటిని. ఈ శివయోగసారావతరణికవలన నీగ్రంథ కర్తృ విషయము విస్పష్టమయినది. కొలని రుద్రదేవుఁడే యేతద్గ్రంథకర్త యగును. ఈతనికి 'వ్యాకరణ బ్రహ్మ'యని బిరుదనామముండుట, కాకతీయ ప్రతాపరుద్ర దేవుని ప్రధాన వర్యత్వముండుట, గన్నయ పుత్త్రిత్వముండుట యట్టి నిశ్చయమునకు సాధకములు.

౬

భీమఖండకృత్యవతరణికలో 'అరియేటి యన్నమంత్రి కొలనిప్రతాపరుద్ర నృపాలునిచే'అరేడు' గ్రామము దానముగొన్నట్టుకలదు. భీమఖండపు రెండుముద్ర ణము లందును నీవిషయమును దెలుపుపద్యము చెఱుపఁబడినది. ముద్రణము లందిట్లున్నది:

కొలనుఁబ్రతాపరుద్ర నృపకుంజరుచేత నరేంద్రసారణీ
సలిలవివర్ధమాన బహు సస్యసమాకుల మగ్రహారమై
వెలయ విభాకరగ్రహణవేళఁదగంగఁ బరిగ్రహించి బం
ధుల భరియించె నన్నవిభుతో సరియెట్లు ప్రధానులెవ్వరున్.

ఈ పద్య మిట్లుండవలెను:

కొలనిప్రతాపరుద్ర నృపకుంజరుచేత నరేడు సారణీ
సలిలవివర్ధమాన బహుసస్యసమాకుల మగ్రహారమై

కొలని ప్రతాపరుద్రరాజు వేఱుగా గలఁడని యెఱుఁగమిచే ద్వితీయ ముద్రణమున కొలను తర్వాత నరసున్న చేర్పఁబడినది. ఇది సహ్యమేకావచ్చును గాని — రెండుముద్రణములందును 'కుంజరుచేత నరేడు' గ్రామ నామమని గుర్తింపక నఱేఁడు, నరఱేఁడు అని యేదేదో స్ఫురింపఁగా నవి తప్పు లనుకొని కాఁబోలును, వానిని సంస్కృతీకరించి 'నరేంద్ర' యని దిద్దివైచినారు. 'నరేంద్ర సారణీసలిల'మనఁగా నర్థమేమనుకొనిరో! ఈ యరేడు గ్రామమును బ్రతిగ్రహించుట చేతనే వారు 'అరియేటి, అరేటి' యింటి పేరి వారయిరి! భీమఖండ ముద్రణమున నిట్టి యఘోరసంస్కారము లనేకములు గలవు. గ్రంథారంభమున రెండవ పద్యములోనే 'ఎలుక నెక్కిన రావుతురాచవారు సేనానియనుంగుఁ బెద్దన' అను సరసపాఠమును 'రావుతురాజు సౌర సేనాని యనుంగుఁబెద్దన' యనియు, - మూఁడవపద్యమున 'వాలికమోముమత్తవనబర్హి కిశోరకలాస్యలీల'

ననియున్న మనోహరపాఠమును 'బాలికమోము మత్తవనబర్హికిశోరకలాస్యలీల' అనియు మార్చినారు. రసప్రసక్తములయిన పాఠములిట్టివి యెట్టేని( బోవు(గాక, చరిత్ర ప్రసక్తములయిన పాఠములుగూడ( జాల( దప్పులుగా( బడినవి! ౬౩ - వ పద్యమున

యవనకర్ణాటకటక భూధవులతోడ(

జెలిమి వాటించి యేలించె( దెలు(గుభూమి—

అని యుండవలసి యుండ(గా 'బలిమివాటించి' యని పడెను.

౭౮ - వ పద్యమున

పంచారామములందు( బల్వేలపురిం ప్రౌఢేందుబింబాననల్

అని యుండవలసి యుండ(గా-

పంచారామములందు( బల్లెల( బురిన్ ప్రౌఢేందుబింబాననల్

అనిపడినది. ౭౯ - వ పద్యమున-

అన్నయమంత్రి శేఖరు( డహమ్మదుసేను వదాన్యభూమిభృ

త్తనిపడినది. ముద్రాపకుల తల(పులో బుట్టిన 'అహమ్మదు హుస్సేన్' ఆ కాలపు(జరిత్రలో( గాన(రా(డు గదా! భీమఖండ పాఠవిశేషములనుగూర్చి విపుల ముగా వేఱొకప్పుడు వ్రాయుదును. ఇది యిక్కడ నంతగా( బ్రసక్తముకాదు.

శివయోగసార పీఠిక కాకతీయ రాజచరిత్రమునను, కృష్ణాగోదావరీ మండలముల చరిత్రమునను గ్రొత్త విశేషముల నెత్తి యిచ్చుచున్నది. పెక్కు గ్రామముల విషయమిందు గలదు.

---

[ * శివయోగసారము : "కొలని గణపతి దేవుడు దీనిని రచించినాడు. ఇతడు క్రీ.శ. 1400 నాటి వాడు. ఈతని గ్రంథము పూర్వభాగ మనియు, నుత్తరభాగ మనియు రెండు భాగములు గలది. పీఠిక వినాగా బూర్వ భాగము నాలుగాశ్వాసములను ఓరుగంటిలో శైవ ప్రచారిణీ గ్రంథమాల ప్రెస్సు వారు ముద్రించిరి. పీఠిక చాల చరిత్రాంశములు గలది. అది వెనుక 'సుభాషి' యను పత్రికలోను, తరువాత 'కాకతీయ సంచిక'లోను ముద్రితమయినది... దీనిలో నెనిమిది యాశ్వాసము లింకను ముద్రితము కాలేదు. ఇది చాల ప్రశస్తమయిన రచనము." చూ. వే. ప్ర. వ్యాసము 'ఉపలబ్ధ, అముద్రిత ప్రాచీనాంధ్ర గ్రంథములు.' భారతి - వ్యయ - వైశాఖము. పుట 415 సం॥]

—o:o—

# Malkapuram Inscription of Kakati Rudra S. S. 1183

*—Mallampalli Somasekhara Sarma*

[The Editor of this journal studied Inscriptions for some time under Sri Sarma while he was an Honours student at Madras during 1950-53. Sri Sarma while teaching used to prepare a brief note on each Inscription for the benefit of his student. This is one such note prepared by Sri Sarma in his own hand which is now being reproduced-Malkapuram Inscription throws much light on the social, religeous and political history of the Kakatiya period—Editor]

**M**alkapuram is a village in the Guntur taluk, Guntur district. The huge pillar inscription at this place is of immence interest both for the historical information it supplies regarding the Kakatiya kings and for the detailed account which it gives of the famous Pasupata teachers who preceded Visweswara Sivacharya of the Gowda country, who was himself the Royal preceptor and a highly learned scholar.

Svayambhu the God Siva at Warangal, the tutelary deity of the Kakatiya kings, is invoked at the begining of the inscription. In the family of the Durjaya Kshatriyas was born the powerful Prola

whose son was Rudra. Rudra's younger brother was Mahadeva. His son was Ganapati deva. His daughter was Rudramadevi. In her time this record was incised.

**Saiva Teachers:** There was a country known as the Dahala-mandala situated between the Bhagirathi and Narmada. In that country flourished a line of Saiva teachers whose founder was Durvasa.

DURVASA

⋮

Sadbhaava Sambhu received from the Kalachuri king Yuvarajadeva as bhiksha (maintenance gift) the three lakh province. This teacher founded a monastery (Matha) called Golakimatha and gave that province for the maintenance of the teachers of that Matha.

⋮

SOMA SAMBHU

He composed in his own name the work called Soma sambhu paddhati.

⋮

VAAMA SAMBHU

His feet were worshiped by the Kalachuri kings. He had thousands of desci ples.

⋮

SAKTI SAMBHU

।

KIRTI SAMBHU

।

VIMALA SIVA

He was born in the Kerala country. He was also highly respected by the Kalachuri kings.

DHARMA SAMBHU

I

VISWESWARA SAMBHU

He administered the diksha to king Ganapati deva. He was himself a great Vedic scholar and a resident of the village Purvagrama in the province Radha of the Gowda country. His other royal desciples were the Chola and the Maalava kings and also the Kalachuri kings. Ganapatideva styled himself the son of this Saiva teacher Visweswara siva. His influence with Ganapatideva appears to have been very great. Numerous teachers of the Saiva faith from the Gowda country and numberless poets were rewarded by the king at the teacher's instance. This teacher initiated also a number of kings into the Saiva faith by giving them Diksha. He is described thus "With hanging ear-ornaments and a high tuft of gold coloured matted hair, a brilliant face and necklaces, the teacher Visweswara Sambhu seated in the Vidyamandapa of Ganapatideva's palace was indeed an object worthy of sight."

In Saka 1183 (Durmati) on Friday, Chaitra ba. 8 the Ist day of Mesha, queen Rudramadevi gave to the teacher, Visweswara Sambhu the Village of Mandara together with the lanka lands of the river Krishna, situated in the Kandravati in Velanadu vishaya on the southern bank of the river, in accordance with the desire of her father who had already orally made a gift of it to the teacher. She also gave on this

occasion, the gift of the village of Velangapundi to the same teacher.

At Mandaram the teacher established a temple for God Visweswara, built a monastery and set up a Satra (feeding house) settled many brahmins and gave the village the name Visweswaragolaki. In this village Mandaram coupled with Velangapundi he gave sixty families of Dravida brahmans 2 putties of land each, measured by the wellknown rod of Penumbaaka with full power to sell, exchange or mortgage. He divided the remaining land into three parts and gave one for the maintenance of the Visweswara temple, another for the maintenance of the students and the Suddha Saivamatha and the third for the maintenance of a maternity hospital (ప్రసూత్యారోగ్యశాల) and for Satra.

There were three teachers appointed for teaching the Vedas Rig, Yajus & Saama and five teachers for teaching logic, literature and the Agamas (పదవాక్య ప్రమాణ సాహిత్యాగమ వ్యాఖ్యాతలు), one capable doctor and one accountant (కాయస్థుడు). Each of these ten received two putties of land. For service in the temple these were appointed: 1 Kashmirian(Songster) and 14 songstresses, six who were experts in dance and Karadaa vaadya. Besides these, Brahmin cooks and servants to the Matha and the feeding house and ten Veerabhadras (Village guards) for the protection of the village and 20 Virmushti servants who were village servants and other Saiva devotees were appointed. There were also

other servants of the village to do the duties of goldsmith, coppersmith, mason, bamboo worker (మేదరి), blacksmith, potter, architect, carpenter, barbar and artisan (సాలె). All these had vrittis. The seventy three servants were given one putti of land each. For the garden all round the temple Visweswarasivacharya gave 1/16 of a nivartana of land. The teacher also gave to 30 brahmans of the Srivatsa gotra and Sama-Veda, the natives of Purvagrama in Dakshina Radha country, 1 putti each and appointed them to supervise the income and expenditure of the village and keep accounts of these in writing. Thus the total of 150 puttikas was given for the maintenance of the several services—1261 A.D.

Veerabhadras came from the chola country, wore matted hair, belonged to one of the four casts and did such acts as "cutting off their scrotum, head or stomach" for the protection of the village.



# నమస్కారములు - ఉభయకుశలోపరి

[ప్రఖ్యాత కళాకారులు శ్రీ చిత్తూరు నాగయ్యగారు గురుదేవులకు వ్రాసిన లేఖ లివి. రంగస్థలం మీదనేకాక జీవితరంగంలోనూ భక్తి ఆయనలో పాదుగొన్నది. శ్రీ ప్రభాకరుల సన్నిధిని ప్రార్థనతో తాను ఆరోగ్యాను భూతిని పొందడమేకాక ఇంక నెందరికో కూడ అట్టి అనుభూతిని వారు కలిగించారు. ఆ విషయాన్ని సూచించేవే ఈ లేఖలు. ఇట్టివే మరికొన్నింటిని మున్ముందు ప్రకటించగలము -సం॥]

బ్రహ్మశ్రీ వేదమూర్తులైన గురువుగారి చరణసన్నిధికి.

మద్రాసు,
17-7-47

శిష్యపరమాణువు నాగయ్య అనేక నమస్కారములాచరించి వ్రాసుకొన్న విజ్ఞాపనలు. ఉ॥ కుశలానంతరం. తాము మద్రాసు నుంచి వెళ్ళిన తర్వాత నేను తమకు ఒక వుత్తరమైనా వ్రాయలేదు కారణం, నాకు ఒక పూటైనా, ఒక గంట కూడా తీరలేదు. చి॥ ముని యిప్పటికి వచ్చినప్పుడు యీసంగతి, తమకు మనవి చేయమని చెప్పినాను. బహుశ, మనవి చేసివుంటాడనుకుంటాను. ప్రతిరోజూ, ధ్యానంలో తమతో సంభాషిస్తూనే వున్నాను. ఇక నా ఆరోగ్యవిషయం :- ఆకలి, నిద్ర, బాగానే వున్నాయి. పాట పాడేటప్పుడు, యింకా, ఆయాసం కొద్దిగా వుంది. గుండెల్లో నొప్పిలేదు. కాళ్లవాపులు అలాగే వున్నాయి. తాము మద్రాసులో వున్నప్పుడు రెండు, మూడు మార్లు స్పృశించినప్పుడు కొంత సుమారుగా వుండింది. కాని, మరల, యధారీతిగానే వున్నయి. తమ దగ్గిర 10 పూటలుండి చికిత్స పొందాటానికి నాకు తీరకుండావుంది. తమబోంటి సద్గురు ఆశ్రయం, అనుగ్రహం లభించినప్పటికీ, నా ఖర్మ అడ్డుపడి నన్ను బాగుపడనివ్వక చేస్తూన్నది. విమోచనమెప్పటికో తెలియకున్నది. ఇప్పటికి, తమ ఆశీస్సుల బలంతోటి నా పనులను నెగ్గించుకొనుచున్నాను. తమ సన్నిధానంలో పది పూటలుండటానికి అనుగ్రహించమని భగవంతుణ్ణి ప్రతిరోజూ ప్రార్థించుచున్నాను. ఆ భాగ్యమెప్పటికో. అది భగవదేచ్ఛ. తమ ఆశీర్వాద బలం నాకు పూర్తిగా వుంటేచాలు. ప్రతిరోజూ, ధ్యానంలోనైనా తమ పాదసేవ చేసుకుంటుంటాను. మిత్రులందరికీ నా నమస్కారములు.

తమ పాదములకు వందన సహస్రంబులర్పిస్తూ విరమిస్తా.

ఇట్లు
భవదీయుడు
వి. నాగయ్య.

మద్రాసు
6-8-47.

పూజ్యులు గురువర్యుల సన్నిధికి

అనేక నమస్కారములు. తాము దయతో వ్రాసిన ఉత్తరం యీ దినం అందింది. తాము సెలవిచ్చినట్లు శ్రీ అనంతం గార్కి చాలా కుదురుపడినది. సోమవారం రాత్రి అనంతం గారు బహిర్భూమికి వెళ్ళి యింట్లోకి వచ్చునపుడు క్రింద పడ్డారట. పడకపై పరుండబెట్టారు. అప్పటి నుండి ఎడమచేయి స్వాధీనం లేకపోగా లేచి కూర్చోలేకపోయారు. మాటలు కొంత తడబడుతూ వుండినది. నిన్న మధ్యాహ్నానికి కొంత ఆహారం సేవించిన తర్వాత లేచి కూర్చోకలిగారు. తర్వాత తమకు తంతియిచ్చిన తర్వాత సాయంకాలం అనగా 7 ఘం॥లకు Reaction చాలామట్టుకు తగ్గిపోయి బాగా మాట్లాడగలిగారు. తమ అల్లుడిగారిని కూడ పిలిపించి చూపారు. శ్రీ అనంతంగారి బంధువుల సలహాపై వారిని యీ దినం హాస్పటల్‌లో చేర్పించారు. ఉదయం హాస్పిటల్‌కు వెళ్లేముందు ఖులా సాగానే వున్నారు.

తర్వాత నా విషయం మనవి చేసుకుంటున్నాను. తాము వెళ్లిన తర్వాత నుండి మనస్ఫూర్తిగా Prayer ఉదయం సాయంత్రం చేసుకుంటున్నాను. కుడి కాలులో చాలా Reaction కలిగింది. యీ దినం పూర్తిగా వాపులేదు. సాధారణమైన కాలులాగు వున్నది. మీరు నాపై జూపు వాత్సల్యానికి నా జన్మ పర్యంతం తమర్ని మరువలేను. తీరిక చేసుకుని కొన్ని రోజులు తమ సాన్నిధ్యంలో ఉండాలని చాలా కుతూహలంగా వుంది. ఆ భాగ్యానికై ఎదురు చూచుచున్నాను. అందరికి నా నమస్కారాలు.

అప్పుడప్పుడు తమకు నా progress విన్నవించుకుంటాను.

ఇట్లు
విధేయుడు
వి. నాగయ్య

మద్రాసు
22-8-47

పరమ పావనులు, పూజ్యులు అయిన బ్రహ్మశ్రీ గురువుల వారి చరణసన్నిధికి

అనేక నమస్కారము లాచరించి శిష్యపరమాణువు వ్రాసుకొన్న విజ్ఞాపనలు.

ఉభయకుశలానంతరం- నేను 10 రోజుల నుంచీ, స్వాతంత్ర్య వుత్స వాలలో పాల్గొనుచుండుటచేతనూ, వరుసగా 7 రోజులు రాత్రిపూట ఫిలిం షూటింగుకు వెళ్ళుచుండుటచేతను, విశ్రాంతిలేక, తమకు వ్రాయలేకుంటిని. మన్నించవేడెదను. నా ఆరోగ్యం బాగా కుదిరింది. కాళ్ళవాపులు మట్టుకు యింకా కొంత వుంది. దానికి, కారణం నాకు బొత్తుగా- విశ్రాంతి లేకపోవటమే గాక, కొన్ని రోజులు, ప్రార్థన కూడా చేసుకోవటానికి, ఒకొకప్పుడు, కారులోవెళ్ళుతూ, ఒకప్పుడు, వేషంమీద, యిలా తటస్థిస్తున్నది. ఇదంతా, నా దురదృష్టం తప్ప వేరుగాదు.

ప్రార్థన మట్టుకు ఏమైనా సరే, వదలకుండా చేసుకొనుచున్నాను. తమ అనుజ్ఞ మేరకు నడచుకుంటున్నాను. నూటిలో 95 పాళ్ళు- కాళ్ల వాపులు కూడా తగ్గిపోయినయి- త్వరలో తమ దర్శనానికి వస్తాను. తాము నాకు చేసిన మేలుకు నా జీవితపర్యంతము కృతజ్ఞతలు.

శ్రీ అనంతంగారు కూడా- యిప్పుడు చాలా మట్టుకు బాగున్నారని విన్నాను. నేడు వెళ్లలేదు. రేపు ఆదివారం గనుక, వెళ్ళిచూచి తమకు వ్రాస్తాను.

అచ్చట మన వారందరికీ నా నమస్కారములు.

నా కృతజ్ఞతాపూర్వక వందనాలు
తమకర్పిస్తూ- సెలవు పుచ్చుకుంటూ
తమ విధేయుడు
వి. నాగయ్య

మద్రాసు,
14-9-47

పూజ్యులు గురువుల పాదసన్నిధికి,

వందన సహస్రములు. ఆలస్యంగా ఉత్తరం వ్రాసినందులకు క్షమింప ప్రార్థన. ఈ మధ్య వరుసగా రెండు వారాలు విరామం లేకుండా Shooting వుండినది. కాని ఉదయం సాయంకాలం Prayer కు మాత్రం ఏలాంటి అభ్యంతరం లేకుండా మనఃపూర్వకంగా సాగించాను. ఆరోగ్యం బాగుగా వున్నది. ఇక్కడి పనుల్ని త్వరలో ముగించుకుని కొంత విరామం కలిగించుకుని తమ సన్నిధానానికి రావలయునని ప్రయత్నిస్తున్నాను. అక్కడ తాము, తమ కుటుంబీకులందరును క్షేమంగా వున్నారని తలుస్తున్నాను. తాము మద్రాసుకు వచ్చే అవకాశముంటే ముందుగా నాకు తెలియజేస్తారని ఆశిస్తున్నాను.

విధేయుడు
వి. నాగయ్య



# శ్రీకాకుళ క్షేత్రము

— వేటూరి ప్రభాకరశాస్త్రి

[శ్రీ ప్రభాకరు లెన్నడో పాత సాహిత్యపత్రికలలో ప్రకటించిన విలువగల వ్యాసము లింకా ఒకటి రెండు మేము సేకరించవలసినవున్నవి. ఇప్పుడు ప్రకటిస్తున్న వ్యాసములివి కొన్ని ఆట్లా దొరకక దాగుడు మూత లాడుచుండినవే. ఇటీవల మా మిత్రులు శ్రీనిడుదవోలు సుందరేశ్వరరావు గారు వాటిని వెలికిదీసి కాపీ చేయించి మాకు తోడ్పడుచున్నారు. వారికి మా కృతజ్ఞత - సం॥]

శ్రీకాకుళము కృష్ణా తీరమునఁ గల ప్రఖ్యాత పుణ్యక్షేత్రము. ఇది యిప్పుడు చల్లపల్లి జమీనులో నున్నది. ఆంధ్ర వల్లభ కాకుళేశ్వర నామాంతర ములు గల యంధ్ర నాయకస్వామి యిక్కడ వెలసియున్న వేల్పు. ప్రాచీన కాలమున నీ శ్రీకాకుళ మంధ్రరాజులకు రాజధానిగా నుఁడెనని యిప్పటి చరిత్ర కారులు కొందఱు వ్రాసియున్నారు. ఆ వ్రాఁతయంత ప్రామాణికముగాఁ దోఁపదు. క్యాంబెలు దొరగారింగ్లీషున వ్రాసిన తెలుఁగు గ్రామరును విశ్వసించి వారట్లు వ్రాసిరి. అథర్వణాచార్య కృతముగాఁ ద్రిలింగశబ్దాను శాసన మను పేర నుపలబ్ధమయిన వ్యాకరణ గ్రంథమందలి యీ క్రింది శ్లోకములు పయి వారి వ్రాఁతల కాధారము. బ్రహ్మాండ పురాణమందలి వట యీ శ్లోకములు :- "ఆంధ్రనాథో మహావిష్ణుర్నిశుఁభ దనుజాపహః! పురా స్వాయంభువమనోః కాలే కలియుగే హరిః, కాకులే రాజవర్యస్య సుచంద్రస్య తనూభవః, ప్రాభ వత్సర్వదే వైశ్చ వేష్టితో లోకపూజితః శ్రీశైల కాళభీమేశ మహేంద్రనగ సంయు తమ్, ప్రాకారంతు మహత్కృత్వా త్రీణిద్వారాణి చాకరోత్, త్రిలోచన స్సన్మహేశ స్త్రిశూలం న కరేధృతః, త్రిలింగ రూపేణ వసన్ త్రిద్వారేషు గణై ర్వృతః, ఆంధ్ర విష్ణు స్సురయుతో దనుజేన నిశంభునా। యుద్ధ్వాత్రయోదశ యుగాన్ హత్వాతం రాక్షసోత్తమమ్, ఆవసత్తత్ర ఋషిభిర్యుతో గోదావరీతటే తత్కాల ప్రభృతి క్షేత్రం త్రిలింగమితి విశ్రుతమ్, తత్రత్యాస్తత్సమాలా పాస్తత్కాలీ నాహరేర్భవాః, కాలేన మహతాసర్వాం తత్సమం స్వల్పబుద్ధిభిః అస్ఫుటేనోచ్చారితాని తద్భవానీతి మే మతిః."ఇది ప్రామాణికమైన చరిత్రాంశము కాఁదగునో తగదో యర్థము పరికించిన వారికి గోచరింపకపోదు. ఈ కథ స్వాయంభువ మన్వంతరమందలి దట! విస్తరింపను.

ఈ నడుమ శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్యమను సంస్కృత గ్రంథ మొకటి ముద్రింపఁబడెను. అదియు బ్రహ్మాండ పురాణాంతర్గతమే యని కలదు. ఈ శ్లోకములందున్నవేమో అని పరిశీలించితిని గాని కానరాలేదు. అందలి కథాంశమునకును మీఁది శ్లోకముల కథాంశమునకును సంగతియే లేదు. అందు సుచంద్రాది వృత్తాంతము కానరాదు ఇటీవల నచ్చునఁ దీర్చబడిన యా స్థల మాహాత్మ్యమున గూడఁ గొన్ని కూర్పులు మార్పులు జరిగినవని తత్రత్యులు స్థలజ్ఞులు చెప్పుచున్నారు. నేనా ప్రాంతములం దాస్థల మాహాత్మ్యపు ప్రాఁత ప్రతికయి వెదకితిని. కాని దొరకినది కాదు. ఇప్పటికి నూతేండ్లకుఁ బూర్వము వల్లభాభ్యుదయ మనుపేర నీ శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్యము ప్రబంధ రూపమున దెలిఁగింపబడినది. అది యిప్పుడు దొరకియున్నది. ఆ తెలుఁగు ప్రబంధము సంస్కృత గ్రంథమును బట్టి రచింపబడినదే. ఆతడును దనకు దొరకిన సంస్కృత గ్రంథము తార్మారుగా నున్నదని చెప్పుకొన్నాఁడు. అచ్చుపడిన యా సంస్కృత స్థల మాహాత్మ్యమునకును నీ తెలుఁగు గ్రంథమునకును బహు భేదము లున్నవి.

అచ్చుపడిన సంస్కృత గ్రంథమున నాంధ్ర నాయక పదముల నిష్పత్తిని గూర్చి యిట్లున్నది:– "యదయం చంద్రవంశీయై ర్నృపై ర్విష్ణు పరాయణైః, నియతం పాల్యతే దేశ స్తదయం చాంధ్ర నాయకః, అకారవాచ్యే నచయ ద్విష్ణు న్నాదియతే సదా, తదాంధ్రో భూదయం దేశ స్తదీశోప్యాంధ్ర నాయకః, ఆ మంగీకార మాచష్టే దృశ్ ధాతుర్ధారణార్థకః, ఆ మిత్యధ్రియతాయం యద్విష్ణు నాంధ్ర స్త దుచ్యతే...ఋషీనగస్త్య ముఖ్యాంస్తాన్ తోషయ న్భక్త వత్సలః అంగీకుర్వన్నధృతయం తమాంధ్రం పరిచక్షతే, ఆంధ్రాణా మిష్టదైవత్వాత్ స్వధృత్యాధ్ర ఇతీరణాత్, ఆంధ్రాది దైవీభూతత్వాత్ శ్రీ శోభా దాంధ్ర నాయకః, ఆంధ్రేషు మధ్యవర్తిత్వా దాంధ్రలోక శుభాశ్రయాత్, ఆంధ్ర సంసేవి తత్వాచ్చ సోఽయ మాంధ్రేశ్వరో హరిః" ఇన్ని త్రోవలతోనున్న యీ నిష్పత్తులు నవీనము లేమో యని నాకు సంశయమగుచున్నది. ప్రాచీన కాలమున "అంధ్ర" పదమే కాని "ఆంధ్ర" పదమున్నట్టు కన్పట్టదు. శాసనము లందేమి ప్రాఁత వ్రాతలందేమి "యంధ్ర" పదమే కన్పట్టుచున్నది. "తయేతేఽన్ధ్రాః పుళిందాః పుల్కసాః" అని వేదమందున్నదట! ఇక్కడ పదచ్ఛేదము "అంధ్రాః" అనియే యగును.

"శైవాని దైవతాన్యత్ర త్రీణి క్షేత్రాణి సంతివై, శ్రీశైల కాలహస్త్యాఖ్య ద్రాక్షారామాభి ధాన్యపి." ప్రాచీనులు శ్రీశైల కాళేశ్వర ద్రాక్షారామముల త్రిక్షేత్రములని చెప్పుచుండఁగా నిందుఁగొంద ఱిటీవలివారు చెప్పుచున్న శ్రీశైల కాళహస్తి ద్రాక్షారామములు బేర్కొనబడినవి.

త్రిలింగ శబ్దానుశాసనోద్ధృత శ్లోకములకు, సంస్కృత స్థలపురాణమునకు, తెలుఁగు పద్య కావ్యమునకు సంగతి లేదంటిని. అట్టి దింకొకటి కూడ నున్నది. శ్రీనాథ కృతియే యని పెక్కురు నమ్ముచున్న క్రీడాభిరామ మను వీధి నాటకమున శ్రీకాకుళ క్షేత్ర వర్ణన సందర్భమునఁగల పురాణ గాథ యొక విధముగా నున్నది. అందలి పద్యములివి:—

"గీ. పసిడి కోరవేఁడి పాలారగించినఁ
బుల్ల సిలిన యధర పల్లవమున
విప్ర కన్య చనవు వెలయంచుచున్నాఁడు
విశ్వమునకుఁ గాకుళేశ్వరుండు.

ఉ. ఈ రసమెత్తువేదములు హీనహిమింపఁ బురాణ జాతముల్
సౌరభహీనమౌ నుపనిషత్తులు వెంబడు నాగ మాపకల్
గారవ ముల్లసిల్ల సిరికాకుళ నాథుడు నాగదేవభ
ట్టారకు నింటఁ బుట్టి ప్రకటంబగు వేడుక నాదరింపఁగన్."

ఇట్టి కథా ఘట్టము మీఁది గ్రంథములలో గానరాదు. పురాణ గాథల విషయ మిట్లుండెను. శ్రీకాకుళ మొకప్పు డాంధ్ర రాజధానిగా నుండెననుటకు నమ్మదగిన యాధారము నాకేదియుఁ గానరాలేదు. ఇప్పుడక్కడ నించుమించుగా ముప్పది శిలాశాసనములు గలవు. వాని యందట్టి ప్రశంస కానరాదు. ప్రాచీన కాలమున నీ క్షేత్రము మహావైభవమనుభవించినది. ఈ విషయము కొన్ని సంస్కృతాంధ్ర గ్రంథములందును, శాసనములందును బ్రస్తావింపఁబడెను. కొన్నింటిని బేర్కొనెదను.

-ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము,
1921-దుర్మతి, మాఘ శు॥ల, శనివారము.



# శివాజి మహారాజు

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మాకిట్లు వ్రాయుచున్నారు : —

మహారాష్ట్రాది భాషలలో శూరాగ్రేసరుడగు శివాజి మహారాజు చరిత్రము రచింపబడినది. నిశిత ప్రతిభా వ్యాపారులగు కొమర్రాజు లక్ష్మణరావు ఎం. ఎ. గారు తెలుగు భాషలో గూడ నేతచ్చరిత్రమును వెలయించి యున్నారు. ఒక్క విశేష విషయము. శ్రీ శివాజి మహారాజు కాలముననే యా గండర గండనికి మిత్రులగు నిర్వురు పండితు లాతడు సలిపిన దండ యాత్రలను, వశపఱుచు కొన్న దుర్గములను, ఓడించిన రాజులను, యథా దృష్టముగాను, విస్పష్టముగా సంస్కృత భాషలో తెలియ వర్ణించి యున్నారు. శ్రీ లక్ష్మణరావు పంతులుగారు గాని, మహారాష్ట్రాది భాషలలో దచ్చరిత్రను రచించిన యితరులుగాని, ఈ గ్రంథముల నెఱుగుదురో లేదో నేనెఱుగను. లక్ష్మణరావు పంతులుగారి పుస్తకమును నేను చూడలేదు. మహాదేవ పండితుడను విద్వాంసుడు శతసహస్రికయగు సంహితగా 'శివభారతమ్' అను పేర మహా గ్రంథమును రచియించెను. సవిస్తరముగా నాతని విజయములిందు వర్ణితములు, మహాదేవ పండితుడను నింకొక విద్వాంసుడు, తంజాపురమును వశపఱుచుకొన్న శివాజి సోదరుడగు నేకోజి మహారాజు కడకు వచ్చి ఏకోజి యెఱుగని కొన్ని విజయములు మాత్రము గ్రంథ రూపముగ వర్ణించి తెలిపి యున్నాడు. "పర్ణాల పర్వతీగ్రహణో పాఖ్యానమ్" అని దీనికి పేరు, ఇవి తంజాపురపు పుస్తక శాలలో నున్నవి. ఈ రెండు గ్రంథములును శివాజి కాలముననే రచింపబడినవి. కన్నార జూచి వర్ణించినారు.

కృష్ణాపత్రిక సంపాదకీయము
3-3-1917

# Pragna Prabhakaram

Translation — *Veturi Prabhakara Sastri*

*Dr. V. Anandamurthy*

[Continued form previous number]

## 15

## TYPHOID

I was always moving up and down all the way from Mylapore to Egmore museum buildings where the Oriental manuscripts library was housed then, to read the rare works found there, in both Sanskrit and Telugu. I used to read a lot and take notes, on all important issues and occasionally publish some of them in the journals. I have seen Sri Vepa Ramesam read extensively day in and day out. So I wanted to emulate his example. He was fortunate enough to continue that way, but it was not that easy for me. What ever I read in the day used to reel in my thoughts in the night. Lack of sleep was the consequnce. When I could not get sleep I used wake up and read again. Thus growing weakness and unrest over came me. I felt like visiting my home town and hence applied for a months leave.

But the very next day after taking leave I got high temperature. Though the Doctor was treating my temperature did not subside. It kept on raising. After watching for four or five days the Doctor suggested to my brother-in-law that I should be sent to my home town. I was in such a poor shape, that I was unable to make the journey. So I sent word to my physician friend, Pandit Gopalacharyulu. He visited me. He said that it would be better to be treated by a doctor who is in the viscinity as he was put up very far away from the place where I lived. I was not

used to allopathic medicines till then. My father was an Ayurvedic Physician. He himself used to treat us all for any minor ailments. I never had any set back in my health till then. I told my friend "I am used to Ayurvedic medicine. Since you are a friend It would be better if you treat me". He agreed and started treating me. Every day from Acharappan Street all the way down to Salai Veedhi in Mylapore-quite a distance he used to travel in a coach to visit me.

One day he gave a tiny pill for free movement of the bowels. It was already ten days since I had any food. I was feeling very weak. With that pill I had that day four or five motions. After the fifth one while coming back from the back-yard I fainted. That was all I knew then. After a while I regained consciousness. I felt for my pulse. The rate was around about two hundred per minute. I could feel my heart thumping within wildly. Sri Ramesam who was nearby was called in. He examined my pulse again. Noticing that I was in a critical condition he hurriedly scribbled a note to Dr. Nanjunda Rao to visit. A messenger left for him with the note. I was gasping for breath. Some one supplied two glasses of milk. I quickly drank it. I felt as if I was coming back to life after ten minutes. In the meantime Dr. Nanjunda Rao came and examined. "Get these medicines immediately. It is a case of severe typhoid" he said giving a prescription slip. Medicines were procured from the Goodwin Company. Immediately after taking the medicines I felt better. Temperature touched normal after twenty two days. Undoubtedly there were few anxious moments during that period. But the medicines prescribed gave me the needed strength to withstand them.

One day he gave me a little laxative and instructed me to stop further in take of the other medicines. That day again I felt very weak. When the doctor visited I told him "Doctor, I was told that you asked me not to take the daily dose of medicines from today. So, I stopped them. But I am not feeling the same after stopping those medicines. I feel very weak now. I was getting a lot of vigour when I took the routine medicines Doctor !" He, patted me and smiled. 'Alright then continue them"he said. Later when the fever was controlled I learnt that the medicines were nothing but chicken broth in brandy and a kind of wine. This knowledge was repulsive; but till that moment that was the life giving tonic to me.

At one stage when my condition was critical my brother-in-law became apprehensive and sent word to my people. Then my friend Susarla Kumaraswami sastri, my parents, father-in-law and my elder brother arrived at Madras. When I was ill my father-in-law informed us in a letter that his daughter had attained puberty. That was an added anxiety to my parents. Some how my fever was controlled. I was on the way to recovery. Dr. Nanjunda Rao sensed the whole situation at home and advised in the following manner- "Take six months leave and go home. You will recover very fast there. You do not have any other trouble or ailment. Usually after typhoid more than ninety percent of the patients recover fully and even pick up better health and vitality than what they had before. Take rest. Within three months you will be feeling perfectly normal, and will be fit to enjoy the family life. Wish to see you back at Madras with family after six months. Wish you all the best." (to be Continued )

# Some ailments and Certain case sheets

—*Vissa Apparao*
(1884-1966)

(Continued from previous number)

[We continue the publication of a few more Case sheets recorded by Prof. Vissa Apparao in the early Forties and later, of certain patients who were cured by the yogic treatment of Sastriji. —Ed ]

**14 T.B. of the Lung:** The patient was the niece of Sri Tatacharyulu Skt. Pandit of Sri Venkateswara College in Tirupati. She was suffering for four years. She was spitting blood whenever she was coughing. Dr. Ramakrishna treated her for sometime but there was no improvement. She was taken to Madras and doctors were consulted but there was no improvement there also. She was ultimately treated by Sri Sastry for a month. Spitting of blood stopped. She picked up strength and was moving about normally.

**15. Obstruction in Blood Circulation**: The grand child (female) of Sri M.M. Venkata Charyulu, B.A., Vakil (Tirupati) age 5 years was suffering from some obstruction in blood circulation. 5 or 6 times everyday, she was turning blue and went out of senses. Doctors declared the trouble incurable. They suspec-

ted an external growth near the heart and said that it was congenital (from the birth). The girl was under the treatment of Shri Sastri for a month. She was not afterwards subject to these fits. She began to play like all children. Doctors said that there was no trace of any such obstruction in the circulation of the blood which she was having previous to the treatment.

**16. Filaria of the Leg:** Shri T.R. Narasimhachary - Manager T.T.D. Press was having both his legs, feet in particular, swollen. It was pronounced to be filaria. He was brought under the treatment of Sri Sastri through Sri Muni Krishnayya. He is now quite alright.

**17. Weak Heart:** Sri Parthasarathi-compositor in the T.T.D. Press, Tirupati, one day while in the press, complained of pain in the heart and fell down senseless. Sri Sastri who was doing his duty in the next building was called. He touched the heart region and treated him. In a few minutes he recovered senses and had no pain. He subsequently walked home.

**18. Jaundice:** The same gentleman subsequently had an attack of Jaundice and was relieved completely in two days after treatment from Sri Sastri.

**19. Reeling sensation and sleeplessness:** Sri K. Subbaramayya B.A.,B.L., Vakil of Chittoor. He was

also not able to plead in the court. He therefore discontinued to go to the court. He underwent treatment by Sri Sastri for a day and he was quite alright.

**20. Epilepsy :** (1) Sri Obul Reddy Dy. Superintendent of Police Kurnool Circle was suffering from fits which were coming on twice or thrice everyday. Exertion resulted in more fits during the day. He was unable to do duty. He therefore took leave. He went to Tirupati and underwent treatment by Sri Sastri. The fits stopped after 2 days treatment.

(2) A Velama Lady from Nuzivid was suffering from fits for some years. She came to Tirupati and underwent treatment for over a month. She was alright and returned home. This was 3 years back.

**21. Paralytic Attack :** Sri Sundararajulu Naidu, Sub-Inspector of Police, Chandragiri had an attack of Paralysis of the right side two years back. The leg and the hand went out of form. He was unable to move his fingers. He left off service and was suffering at home. Just now a fortnight back (about the 1st July 1947) he started treatment under Sri Sastri. He goes to Sri Sastri morning and evening on a bandy. He seems to have some improvement. He is able to utter one or two words clearly and his fingers respond a little. Much improvement is awaited.

**22. Chronic Headache and Consequent Fits :** Mrs. V. Muni Krishnaiah wife of Vakil of Tirupati

was having headache for the last 25 years. In later years, recently, she was also having some fits as a consequence. She was treated by Dr. Ramakrishna of Tirupati. Dr. Guruswami and Dr. Aruna Chelam of Madras. But she was no better. She grew worse gradually.

Last year she was brought to Sri Sastri. He stated on the first day that it was due to an astral affect. It was disclosed a few days after that it was due to three agencies (1) Kateri (2) Ramananda Yogi and (3) Muniswarudu. She was going into an unconscious state while under treatment by Sri Sastri and was making certain statements from which the above three affects were understood. Sri Sastri used to converse with her in that condition of trance, giving suitable replies and making certain suggestions evidently to the three agencies that possessed her. It was finally settled that Kateri should take birth elsewhere in another family and that the other two should take birth in this family one after the other. Mrs. Muni Krishnayya was ever since completely free of the headache and other effects.

**23. Leprosy** : Mrs. K.L. Narasimhachary second wife of an advocate, Tirupati, was having white leprotic patches allover the body. She was treated by Doctors, underwent ultraviolet ray treatment but she was no better. She came under the treatment of Sri Sastri. It transpired that the trouble was due to astral effect. The first wife and the mother-in-law

possessed her. The first wife complained (when the patient was in trance, the astrals were making statements as usual in all such cases) that her children were being illtreated by the second wife. So she said she caused this ugly disease. Sri Sastri touched her body over the affected parts and treated her. He suggested to the first wife to take birth in the family and enjoy the property and assured better treatment for her children. The patient improved in a few days. The patches disappeared she was feeling energetic and normal. She is now in the family way.

An interesting fact came out in the statements made by the patient in her trance condition. The advocate husband inherited a large property - lands. They belonged to another person who did not belong to the family. The forefathers of the advocate acquired the property by questionable and fraudulent methods. The owner of the property committed suicide by falling into a well, not able to bear the sight of his family which was actually starving. This real owner of the property had his share in the astral effect. He gave out that the old pattahs and other papers about the property kept in record with the advocate would give a clear indication of this fact and when the advocate expressed no knowledge of it, told him to go and have a careful scrutiny. Strange to say the indication given was borne out by the reeords - the advocate stated subsequently a few days after the incident. (to be continued)



# A BROKEN HARP

Telugu original "KARUNAKAMU"
Published in Bharati, August - 1924

Translation :
—V. Anjaneyulu —Veturi Prabhakara Sastri.

There is a village called "Movva" in Krishna District. There are very few 'Rasikas' who have not heard of, and having heard not appreciated 'Venugopala Padams'. It is said that the poet who had composed these 'Padams' belonged to that village. The elders of yore felt that merely by drinking the water of the village one acquired proficiency in literature and music. But now there is no such evidence. The people of that village say that after the soil of the village came under irrigation with the excavation of the Krishna Canal, the quality of the water had changed. May be ! In olden times it appears that there were many learned men proficient in music.

Adjacent to Movva, there is another village called Kuchipudi. All the residents of this village enact the scenes from Bhagavatam! They are *par excellence* in enacting ( Veedhi ) 'street plays' in open air. Legend has it that one 'Yogi' by name Siddhendra had imparted the histrionic skill to the residents of the

village. It appears that he had ordained that the skill should be a heriditary acquisition compulsorily bequeathed by sire to son. Even now this injunction is being followed. As the above mentioned two villages are adjacent, the skills of one village, in olden times, spilled over the other village and *vice versa.* In the story that I am going to narrate about Hari Ramayya, except himself there was no other musician in Movva village in the intervening period. Even people of the current times will come to know that there was one by name Hari Ramayya in the village, and that he was a great musician, only at the end of this story.

Ramayya was probably born in 1860. In his boyhood the 'Kritis' of Thyagaraja were not so well known in the Telugu region. If appears that mostly Ashtapadis, Tarangams, the songs of Tallapaka composers, Tanjavur Padams etc., were sung. Though we have not known, I had heard from those who knew that in his boyhood Hari Ramayya's Veena play and singing acquired great eclat.

In confirmation of it have I heard the following story : In those days one, Veena Sambanna who was a great celebrity in music came from Mysore to Andhra Desa; stayed for some months along with his disciples at Bandar (Machilipatnam) and other places, held many music concerts, acquired great reputation and vast sums of money before he left. Even now some speak wonderingly of him. When he was holding a

music concert at Bandar, one Deputy Collector was said to have intervened in the midst, and twisting his moustache asked him to sing a particular 'raga'. Sambanna got enraged and shot back : "When I am playing this 'raga' which is like the shower of manna from above, instead of exculting it why does this ignoramus ask me to sing some other 'raga' ?" So saying he un-tuned the veena, put it down, and said he further: "This samba's song should only be heard by that Samba (meaning Lord Siva) - what is there for you to hear ? begone ! begone !"

Such a Sambanna was overwhelmed with joy after hearing Hari Ramayya's Veena recital, embraced him and, it seems, congratulated him by saying : "My boy ! Your profundity in music is extraordinary". He then took Ramayya to Mysore, got a music concert arranged in the Maharaja's 'durbar' for him and conferred great honour on him. The Maharaja, who was in raptures presented Ramayya with twice the amount of Rs. 116, Gold bracelets studded with gems for both his wrists, two shawls, gold laced truban, a gown etc. This pleasant episode happened before we were born.

It seems they got the gold bracelets melted owing to want. But many people knew how Ramayya was, now and then, airing the worn-out and insect bitten shawls, gown and turban in the sun and smoothen them out. The tale of such a reputed musician began turning topsy-turvey for the last 20 years.

He had only a daughter. She was brought up with care ond fondness. He arranged for her a very good match giving substantial dowry which was beyond his means, thinking that it should be conmensurate with the esteem he had established as a musician. He celebrated the marriage with great pomp. Well known pipers were brought from Chennapatnam (Madras). Many musicians of note had also attended the marriage. He rewarded them all handsomely. He did not, however, have sufficient money to celebrate the wedding on a lavish scale. He had only three acres of wet land. With confidence in his widely known musical talent he had incurred debt and performed the wedding on an impressive scale. He thought that he could hold music concerts in four or five well-known places and easily discharge the debt. His mind was working differently.

Even before the lapse of a month after the marriage the bridegroom died. Alas ! this was the begining of Ramayya's life running awry.The daughter's grief cut him to his heart. Distraught by this calamity, he did not step out of the house for two or three years. Worry had worn him out. Indebtedness had increased. Income from land was insufficient for subsistence. He got entangled in difficulties. In those days there were many who knew his worth and had appreciated the intrinsic value of music. Sorrowed at the evil days that had befallen him they used to arrange for extending necessary succour to him. In

such a situation, there was, at that time a marriage at Bandar in a big merchant's house.

Arrangements for the marriage were made on a princely scale. The enlightened ones had considered and decided upon arranging Hari Rammayya's music concert for that marriage. The pressure from the creditors was such that Ramayya had to agree to it. It was decided to pay him twice the amount of Rs. 116/-.

Gas lights had not come into use at that time. For the first time they were brought from Madras for the marriage. For Hari Ramayya's music concert that evening, many persons came. The gas lights were lit. Hardly had Hari Ramayya begun to tune the Veena and play, something amiss had happened in lighting the gas lights and one had burst. The 'pendal' caught fire. Inauspiciously, the bride and some others had sustained burns. With this mishap the evil word had spread that Ramayya's singing was bodeful. Some say that unidentifiable musicians who could not raise their heads in the context of the wide-spread renown of Ramayya had spread this canard. Whoever had done it the grapevine had spread well in those parts. From that day the number of those who thought of Ramayya's music concerts had declined. Apart from this bad reputation the change in times and tastes had also adversely affected the esteem in which he was held.

What I am saying now relates to the situation obtaining fifteen years ago. Drama theatres with *Hindustani* (Parsikhath) style of song rendering, *Javalis* (erotic love songs) *tappas* and such type of novel music; new musical instruments like fiddle, harmonium etc., came into vogue. With the mounting craze for them, patronage to traditional musical instruments and traditional modes of music had become scarce. Is there not the proverb; "The new is wondrous : the old is stale!" Ramayya used to proclaim that it was mushroom music. Many of his friends, who had known the essence of music, had passed away. The new generation of youth considered his words as mean. With this, it may be said that the respect for him, had partly been eroded. Whatever it was he did not lose confidence in his profeciency. Though age was encroaching on him, he did not give up practising music daily both in the morning and evening. He would go to the outskirts of the village and make the trees, birds, ant heaps, bunds and infants listen daily to his songs.

Eventhough he was fifty or fifty five years old the rows of his teeth were close without giving way and being uneven.

The saying is that if God is not favourable even gold becomes dross. In the small hours on a day when he was removing the cover of the Veena for practising, his index finger and middle finger were stung

by a big scorpion. He suffered from it for a week. Finally, both the fingers became numb and got bent. With this the ability to play on Veena had gone. Were not a series of un-lucky events occuring to him insufferably ? His house and fields were disposed off for the settlement of debt. For the three - wife, husband and daughter - in Movva it had become difficult to lead a hand to mouth existence. Will not all graces and virtues turn to dust at the fatal touch of penury ? For all those who were nearby, his music, and his very words had become a matter for heckling. When there was no work to be done people made Ramayya, on occasion, to narrate tales of his journey to Mysore, the tales of music concerts of those times, and heckled him through false praise. With his enormous confidence in his knowledge innocent Ramayya felt pleased in the belief that their praise was genuine.

I am mentoning about what had happened ten to twelve years ago. Dramatic Associations had grown apace in Andhra Desa. There were competitions, tests and conflicts among dramatists on acting and singing. Some people were agitating for the restoration of traditionally scientific methods attacking spurious acting and mongrel music. Both the sides started writing articles in the news papers. When the youth were reading aloud such matter in the Movva Reading Room, Ramayya used to listen to it. verily if such criticism gained ground, he had cherished the fond

hcope that his erudition would come into the limelight. There appeared an advertisement in the newspapers one day that in Bezwada the Zamindar of Nuzvid, Ramarayanimgaru was going to start a Music Academy which would promote only Carnatak music of the classical type; that Hindustani and other mongrel music would have no place in it; for imparting knowledge in music music vidvans of calibre were required; that the sponsors were endeavouring to promote dramatic art, if the vidwans also knew 'abhinaya' it would be much better, and such scholars might see the Zamindar at Bezwada. The youth who were visiting the Reading Room had informed Ramayya about the advertisement. Ramayya thought that in music and 'abhinaya' there was none more competent than himself and that if he went there he would certainly be respected. The very next day he had left with his family for Bezwada. They did not have much of personal effects except cooking pots, tumblers for drinking water and four or five other vessels besides the truban, gown and shawls presented at Mysore. They stayed with an old woman who was an acquaintance. As they had started on their journey on an auspicious day, the next morning Ramayya dressed himself for having the 'darsan' of the Zamindar. The dress that was presented by the Mysore 'Samsthan' when he was aged twenty might have fitted him well then for his good physic, but put on at the age of sixty, they appeared as though worn-out clothes of

